ప్రథమ ముద్రణము- 1000 ప్రతులు.

## —: కృతజ్ఞతలు :—

"శ్రీకృష్ణాష్టమి" (వికారి సం|| లో) శుభదినమున ప్రారంభించినందులకు గ్రంథమును పూర్తిగావించిన శ్రీకృష్ణ పరమాత్మకును, ఈ గ్రంథమును పరిశీలించి, తగిన సలహాలను తమ అభిప్రాయముల నొసంగిన పండితాగ్రగణ్యులకును, సత్కార్యమని గుర్తించి, ప్రోత్సహించి, ఆర్థికంగా సహాకరించిన సత్పురుషులకును, మిత్రులకును; ఇక దీనిని ఓపికతో జదివి, సద్గుణముల నలవఱచుకొనువారికిని; ఇందులో లోపములున్నచో- ముందు సవరించుకొనుటకు- నాకు, దయతో తెలియజేయు పెద్దలకును; ఇతోధిక శ్రద్ధవహించి తోడ్పడిన శ్రీ మాధవదాసుగారికిని; నేనెంతయు కృతజ్ఞుఁడను.

— గ్రంథకర్త.

శ్రీరామా ప్రెస్, కరీంనగరము.

ఓమ్

# అభిప్రాయము

శ్రీమాన్ కలవకుంట కృష్ణమాచార్యులుగారు వ్రాసిన "యథార్థ మానవత్వము" అన్న గ్రంథమును అక్కడక్కడ చూచితిని. మానవునియొక్క ప్రవర్తనను గురించి బాగుగా తెలిసికొని, చదివి వ్రాసినట్లున్నది. భగవద్గీతలోని శ్లోకములు, కొన్ని భాగవతములోనివి తీసికొని, ఇంచుమించుగా వ్యాఖ్యానము చేయబడినది. మనుస్మృతిలోని కొన్ని విషయములు కూడ ఇందు సమకూర్పబడినవి. కొంతభాగము ప్రస్తుతకాలమునకు యోగ్యముగ వ్యాఖ్యానము చేయబడినట్లు గనిపించుచున్నది. మన పూర్వులందరు నిట్టి సర్వగ్రంథములు వర్ణాశ్రమాచారవ్యవస్థ కనుకూలముగ వ్యాఖ్యానముచేసిరి. ఈకాలమునందు తద్వ్యవస్థావిరహితమైన మానవత్వ రక్షణమునకు అనుసంధించిమాత్రమే. వ్యాఖ్యానము చేయబడుట వాంఛనీయముగా గనిపించుచున్నది. అహింస, క్షమ, తితిక్ష మొదలైన గుణములున్నవి; ఇవి సంపూర్ణముగ బ్రాహ్మణ గుణములు. క్షత్రియుడు అహింసకు, క్షమకు ప్రాధాన్యమిచ్చినచో శత్రుసంహారము చేయలేడు. శత్రుకృత పరాభవమును మన్నించవలయును. సామాన్య వేళలయందు నహింసయు, క్షమయు సర్వమానవులు నవలంబింపవచ్చును. అధికారము కలవాడు లోకవృత్తమునందు వానినవలంబించినచో లోకవృత్తము చెడిపోవును. ఇట్టి ధర్మములు విశేషధర్మములు. విశేషాచరణముతో కూడినవి. మొత్తముమీద నగటున నాత్మగుణములందఱకు గావలసినవే. వాని యాచరణము, వేళనుబట్టి,

వాని లౌకిక వృత్తినిబట్టి; అందుకొఱకే వర్ణాశ్రమాచార ధర్మ వ్యవస్థ. అందరు నన్నియు చేయుటకు వీలులేదు. అనగా సాధ్యముకాదు. కొందఱు కొన్నిటిని చేయక తప్పదు. ఇది చాల లోతుగా విచారించవలసిన విషయము. స్థూలముగా భావనచేయుచు దానియందు, సూక్ష్మత పట్టించుట ఎంతవఱకు న్యాయమో తెల్యదు. మాంసఖాదులు, మాంస విక్రేతలు, ప్రాణివధనువదలి, సర్వమైన హింసనుచేయు వారు. దానినికూడ రహస్యముగ చేయుటకు వెనుదీయనివారు, సర్వకాలములందు, సర్వదేశములందు నిండియుందురు. వారహింసావాదులుగా చలామణి యగుదురు. వారికహింసాతత్త్వమునందు మిక్కిలి ప్రీతి. తత్త్వమునందు ప్రీతియుండుట న్యాయమే. అదికూడ లేని వారిదృష్ట్యా వీరు మంచివారనియే చెప్పవలయును. అట్టివారు బాగుపడుటకు వీలున్నది. ఈ గ్రంథము తాదృశులకొఱకుప యోగించును. మన స్వరూపమిట్లున్నది. అని తెలిసికొని వారిట్టి గ్రంథములనుచదివినచో బాగుపడవచ్చును. అంతేకాని, ఆలో చించబడని సిద్ధాంతముల వెంట మందగాబడిపోయినచో మంద యెచటికిపోవునో తాను నచటికేపోవును. ఇట్టి విషయములు మందదృష్టితో చదువదగినవి కావు. వ్యక్తిదృష్టితో చదువతగినవి.

ఇట్టి గ్రంథము నేటి కొందఱకుపయోగపడునట్లు వ్రాసిన కృష్ణమాచార్యులుగారు ప్రశంసార్హులు. గ్రంథ రచన బాగుగనే యున్నది.

కరీంనగరము
4–7–1960

కవిసామ్రాట్
( విశ్వనాథ సత్యనారాయణ )

# పీ ఠి క

ఈశ్వర నిర్మిత ప్రపంచమున పశుపక్ష్యాది జంతువుల కును, మానవులకును కొంత భేదము, విశిష్టతయును ఉన్నట్లు గ్రహింపులో రాకతప్పదు. వైజ్ఞానికులగు సమదృష్టి గలవారికిమాత్రము సర్వము జ్ఞానాకారముగ నాత్మదర్శనమున్నను, శారీర తారతమ్యముగలదని వారికిని తెలియును. సృష్టికర్త యగు ఈశ్వరుని; సృజ్యమగు ప్రకృతిని; సృష్టివిశిష్టమగు జీవ సమష్టిని, సృష్టివైచిత్ర్య కారణములనుగూర్చి విచారించు హక్కు, యోగ్యత మానవులకుమాత్రము కలదు. అట్టి సృష్టి విజ్ఞానము లభించెనేని మానవుడు ఉత్తమోత్తముడుకాగలడు.

సర్గ (సృష్టి) విభాగమును గుఱించి, భగవద్గీతాప్రకరణములో "ద్వౌభూతసర్గౌ లోకేస్మిన్ దైవఆసురఏవచ"... దైవము— ఆసురము అని రెండువిధములుగా గీతాచార్యులు సెలవిచ్చి, దైవాసురసర్గములో చేరిన ఈ లోకములో ననుటచే :— మానవులు దుర్గుణభూయిష్ఠులైనచో; ఆసురులు (రాక్షసులు) గా; సుగుణములుగలిగిన దేవులుగా; నగుదురని సూచించియున్నారు. కావున "యథార్థ మానవత్వము" సగా దైవీసర్గములో చేరినవారికుండు గుణములు గల్గియుండుట. అదియే మానవుడు కోరదగిన ముఖ్యసంపత్తుగాని, పతనావకాశముగల యాసురత్వముకాదు. దేవా-సురుల భావముల మధ్యలోనున్న మానవుడు దైవీభావములు— కావలెననుకొనుట పురుషార్థముకాని,-రాక్షసభావములుకావలెననుకొనుట వెఱ్ఱితనమేయగును. ఈ విషయమే మనము చదువనున్న ఈ గ్రంథములోని ముఖ్య విషయము.

ఇక ఈ దైవీసంపత్తునకు కావలసిన గుణములు 26. (ఇరువదియారు) వాటి క్రమప్రకారముగూడ అర్థసహిత

ముగనున్నది. దానినిగురించి తెలుపుటకూడ ఇచటఅవసరము:-

1. అభయము:- మానవునకు పిఱికితనము లేక నిర్భయముగ నుండుట యవసరము. ఇష్టానిష్టములు, చేకూఱకుండుట- చేకూఱుటవలన కలిగిన భయము" లేకుండుటయని అర్థము. ఇది యుండెనేని మిగతవి తర్వాత గల్గును. కావున నిది మొదటిది.

2. సత్వసంశుద్ధి:- రజస్తమోగుణములచే దూషితముగాక మనస్సు శుద్ధముగనుండుట; పై విధముగ నిర్భయము గలవానికి, రాగ-ద్వేష కారణములగు రజస్తమస్సులంటవు గాన, శుద్ధమనస్సుగలవాడే నిర్భయుడుగా నుండునని తలంచి, రెండవ గుణముగ నుంచబడినది 3. జ్ఞానయోగ వ్యవస్థితి:- పై రెండు గుణములుగలవాడు దేహాత్మలను రెంటిని, వేఱుగా తెలిసికొని ఆత్మయందే నిష్ఠగలిగియుండును. 4. దానము:- ఈవిధముగ నిర్భయుడై, మనశ్శుద్ధిగలిగి, ఆత్మనిష్ఠయు గలవాడు, తన ద్రవ్యమును సత్పాత్రమునను వినియోగించుచు,- 6. యజ్ఞ, 7. స్వాధ్యాయ, 8. తపస్సులను చేయును. ఈ మూడింటికి, ఇంద్రియ నిగ్రహ రూపమగు, 5. దమము అవసరము గాన ఐదవ గుణముగ తెల్పబడినది. ఇప్పటికి మొత్తము ఎనిమిది గుణములు క్రమయుక్తములు.

9. ఆర్జవము :- శుద్ధ మనస్సు, వాక్కర్మలును ఏకరూపముగా నుండుట యను ఆర్జవము తర్వాత సిద్ధించును. 10. అహింస:- పై గుణసంపత్తిగలవాడు ఇతరులను పీడించుటకై ప్రయత్నించకుండును. 11. సత్యము:- పరహితముగ యథాదృష్టముగ పలుకుచుండును. (12. అక్రోధము:-) ఇతరులను

పీడించువాడు కానందున, క్రోధమీతనికుండదని "అక్రోధ" మిచట చేర్చబడినది. (13. త్యాగము) పై యధికారి ఎట్టి త్యాగమునకైనను బూనును. పై గుణముల మూలముగ త్యాగము సంభవించునని, ఈతర్వాత తెల్పబడినది. [14. శాంతము] ఇంద్రియములు చలింపక రాగాదులు లేమి; హృదయ శాంతి నుండుననుచు సందర్భానుసారముగ నిది తెల్పబడినది. [15. అపైశునము] 16 భూతదయ, 17. అలోలుత్వము, 18. మార్దవము, 19. హ్రీ, 20. అచాపలము, 21. తేజస్సు, 22. క్షమ, 23. ధృతి; 24 శౌచము. 25. అద్రోహము; అనునట్టి తర్వాతి గుణములు: తనను గురించియు; ఇతరులను గురించియు, చక్కని వివేకము కలిగియుండుటచే; సంభవించు నని, యథాక్రమముగ తెల్పబడినవి. ఇక చివరిది, 26. నాతి మానితా:— ఇది యహంకారము లేకుండుట, యని అర్థము. మానవుడు తన యథార్థస్వరూపమగు, అహంకార త్యాగము చేయుటకు; పైనజెప్పిన 25 గుణములు ఉండక తప్పదని, క్రమ ముగ నిట్లు ఒకటికీతర్వాత నొకటి చేర్చబడినవి.

ప్రకృతి తత్వములు 24 విధములు. 25వ వాడు జీవుడు. 26వ వాడు ఈశ్వరుడు. కావున నదేసంఖ్యతో నిట్టి గుణములు 26 జెప్పబడినవి. ఈ మొత్తము గుణములుగలవాడు- యథార్థ మానవుడు [దేవతుల్యుడే] అగును. ఇదియే దైవీసంపత్తు వైభవము.

పై విధముగనున్న "యథార్థ మానవత్వము"ను గూర్చి పండితులకన్న పామరులకెక్కువ యర్థమగునటుల శ్రీ కలవ కుంట; కృష్ణమాచార్యులుగారు చక్కగా వివరించి వ్రాసి నారు. సద్గుణములను, అందరు నేర్చుకొనవలెనను పరసమృద్ధి

భావనతో, విపులముగ, సులభముగ నుండునట్లు శ్రమజేసి, యనుభవములతో, సాధారణ శైలిలో తెల్పగల్గినారు.

కాని దోషములుగల్గిన అసురుల [రాక్షసుల] గుణస్థితులను వర్ణన చేయలేదు. అది యనవసరమని, భావించి, నేనిచట పొందుపఱచుచున్నాను. ఎందుకనిన; అట్టి స్థితినికూడ తెల్పినచో "యథార్థ మానవులు" కాదగినవారు, అసురత్వమునకు దూరముగనుండుటకు, దైవప్రార్థన పూర్వకముగ ప్రయత్నించగల్గుదురేమో! సర్వము దైవాధీనము.

<u>అసురులు - [రాక్షసులు] :—</u>

వైదిక ధర్మములగు ప్రవృత్తి-నివృత్తులు, శౌచాచారములు అసురులకుండవు. సత్యమేదో తెల్యజాలరు. జగత్తు బ్రహ్మాత్మకము కాదని, ఈశ్వరుడనువాడు లేడని, పరస్పర; కామోద్రేకాలవల్లనే జగత్తు కల్గినదని వాదింతురు. ఈదృష్టితో, దేహాతిరిక్తాఽత్మ విజ్ఞానములేక, అల్పబుద్ధులై, ఉగ్రమైన పనులతో జగత్తును నశింపజేయ నుద్యమింతురు.

<u>వీరికుండు ముఖ్య గుణములు :—</u>

ఇతరులయపేక్ష లేక నేనే,- చేయుదునను <u>అహంకారము</u>; అన్నిటిని సాధించుట కన్ని విధముల గుణసామర్థ్యములు గలిగియున్న <u>బలమును</u>; నాయంతవాడు లేడను <u>దర్పము</u>; నాకంతయు లభించగలదను <u>కామము</u>, ఎవరు నాకు హానిగల్గింతురో వారిని జంపుదునను <u>క్రోధము</u>, ఇవి యాసురగుణములు.

ఇక వీరి భవిష్యత్తు :-

భగవంతుని ద్వేషించుచున్న క్రూరులైన, నరాధము లగు పాపులకు, సంసారములో [చావు-పుట్టుకలలో] తిరుగుటయు, భగవద్వ్యతిరిక్తములగు జన్మముల నెత్తుచుండుటజరిగి, క్రూరబుద్ధులుగనే యుంచబడుదురు. ఇట్లు పుట్టుచు-చచ్చుచు మంచి స్థితిని పొందక నీచాతినీచములైన జన్మలను పొందుచు; తిరిగి, తిరిగి మంచి జ్ఞానము కలుగునంతటి "యాత్మశుద్ధి" గల్గు వరకు బాధింపబడుదురు. ఒక ద్రవపదార్థము మంచిరసముగ పరిణమించువరకు, కళపెళ నుడుకవలయునుగదా!!

కావున నీ రెంటిస్థితులను గుర్తించి, భగవత్కృపకు పాత్రులు కాగోరువారు; పూర్వజన్మ సంస్కారముగల్గి శాస్త్రవిశ్వాసము, పెద్దలయెడ భక్తి, మాతా-పితాచార్య దేవులయందు కృతజ్ఞతయు, పాప-పుణ్యములందు భయము చేత, పశ్చాత్తాపముబొందిన సాత్వికులు, ఈ ఆచార్యులవారి కృషిని, సార్థకత నొందించుటకు, చక్కగా జదివి, అనుష్ఠాన మననములనుజేసి, ఇతోధికముగ నిట్టి సాత్విక సముదాయమునకు ప్రబోధించి; దైవీసంపన్నుల గుంపును పెంపుజేసికొని; రాక్షసవర్గము తగ్గునట్లు భగవంతుని ప్రార్థించి, భూభారమును తగ్గింతురని యాశించుచు సెలవు తీసికొనుచున్నాను.

కరీంనగరము
శార్వరి, జ్యేష్ఠ బ॥ ౧౧
తేది 19-6-1960

ఇట్లు
బుధజన విధేయుడు;
కందాడై; రంగాచార్యులు,
వేదాంత శిరోమణి; విద్వాన్.

ఓమ్

# విజ్ఞప్తి

---

## మానవుని ప్రాముఖ్యము ఎట్టిది ?

శ్లో॥ ఆహారనిద్రా భయమైథునాని
సామాన్యమేతత్పశుభిర్నరాణాం ।
"ధర్మోహి" తేషా మధికోవిశేషో ।
ధర్మేణహీనాః పశుభిస్సమానాః ॥

"ఆహారము, నిద్ర, భయము, [స్త్రీ-పురుష] సంభోగము మొదలగునవి పశువులకు, మనుష్యులకు సమానముగ నున్నవి. మనుష్యులలో ధర్మము (లేక వివేకము) ఒకటే విశేషముగనున్నది. పశుత్వము- మరియు మనుష్యత్వములో నున్న విశేషతను తెలుపు వివేకము (జ్ఞానము) ఉన్నప్పుడే "మనుష్యుల"నుటకు వీలుండును. ధర్మవిహీనులు [వివేకము లేనివారు] పశుతుల్యులు. కావున మనుష్యుడన్న ధర్మవర్తనుడు కావలెను. ధర్మమనగా :—

శ్లో॥ అహింసాసత్యమస్తేయం, శౌచమింద్రియనిగ్రహః ।
ఏతం సామాజికం ధర్మం, చాతుర్వర్ణ్యే బ్రవీన్మనుః ॥
[ మనుస్మృతి- 10-63 ]

అహింస, సత్యము, దొంగిలించకుండుట, సదాచారము, ఇంద్రియ నిగ్రహము ఇవి అన్నివర్ణములవారికి సంక్షిప్త ధర్మములు. వీనిని ఆచరించుటవల్ల పవిత్రులగుదురని మనువు చెప్పియున్నాడు.

అట్లు ప్రవర్తించుటవల్ల మనుష్యుడు దుష్కర్మలకు లోనుగాకుండును. వివేకముగలవాడై ఆత్మజ్ఞానము సంపాదించగలుగును. భగవద్భక్తుడగును. కావున ధర్మమార్గమును విడువగూడదు. ధర్మవర్తనుడు కానిచో పశుతుల్యుడగునని స్పష్టమైనది. అట్టివాడు తల్లి, తండ్రి, పుత్రులు, కూతురు, తోబుట్టువు మొదలగువారిలోగల భేదమునుకూడా తెలిసికొనలేడు. ఇదేవిధముగ వివేకహీనుడు భార్య, సోదరి, కూతురు మొదలగువారిలోగల భేదమునుకూడ తెలిసికొనకున్నచో, అదత్తాదత్తములు, అగమ్యాగమనములు మొదలగునవి జరుగును. ఇట్టి విరుద్ధ కర్మలకు పశువులకు ఎట్టి నిషేధముండదు. ఇదే పశుత్వము.

కావున మనము అట్టి అవివేకమునుండి విముక్తులమగుటకు మరియు శాస్త్రసమ్మతముగ నడుచుకొనుటకు ప్రయత్నించుట ముఖ్యము.

శ్లో॥ మతయో యత్రగచ్ఛంతి, తత్రగచ్ఛంతివానరాః।
శాస్త్రాణి యత్రగచ్ఛంతి, తత్రగచ్ఛంతి; తేనరాః ॥

"బుద్ధికిదోచినట్లు ప్రవర్తించువారు వానరులు. శాస్త్రసమ్మతముగ నడుచుకొనువారే మానవులనబడుదురు.

కావున ధర్మాచరణ కలవారమగుటలోనే మానవత్వసిద్ధిగలదు. ఇట్టి ప్రాముఖ్యమును తెలిసినవారుకూడ కొందరు వ్యర్థముగ కాలముగడుపుచున్నారు. "ఇప్పుడైతే నేను యౌవ్వనవంతుడను. ఇది కేవలము భోగములననుభవించు కాలము. ఇట్టి సమయమందు ధర్మవర్తనమెట్లుజరుగును; అన్ని యనుభవించిన తరువాత వృద్ధుడనగుదును, అప్పుడు మాత్రము ధర్మ

చింతన, భగవద్భక్తియు చేయగలను. ఇప్పుడేమి తొందర వచ్చినది!" అని తలంచుచు శక్తియున్నపుడే ధర్మసంగ్రహము చేయక అమూల్యమైన సమయమును వ్యర్థముచేయుట జరుగుచున్నది. ఎట్లనిన :—

శ్లో॥ అనిత్యాని శరీరాణి, విభవో నైవశాశ్వతం।
నిత్యంసన్నిహితోమృత్యుః, కర్తవ్యో ధర్మసంగ్రహః ॥

శరీరము నశించునది, సంపదలు వెంటరావు, నిలువవు; దినదినము మనదగ్గరకే "మృత్యువు" వచ్చుచున్నది. (సాధ్యమైనంత తొందరగ) ధర్మసంగ్రహము చేయుటయే మన కర్తవ్యము.

మన శరీరము ఇచటనే ఉండిపోవును. పరలోకమందు రక్షించుటకు ఇచ్చటి వస్తువు సామర్థ్యముగలిగి యొక్కటి కూడలేదు. ఒక్కగానొక్క "ధర్మమే" మనవెంటనుండి రక్షించును.

కావున మనుష్యుడు ధర్మమును రక్షించవలయును. మనుష్యునిచే రక్షింపబడిన; మానవుని అది రక్షించును. "ధర్మో రక్షతి రక్షితః" అను వాక్యము గలదుగదా! ధార్మికచింతనతోపాటు మనము సదాచారవంతులమగుట యవసరము. సదాచారమే మానవుని పవిత్రునిగ, ప్రతిభావంతునిగ జేయుచు.

శ్లో॥ ఆచారాల్లభతేహ్యాయు, రాచారాదీప్సితాఃప్రజాః ।
ఆచారాద్ధనమక్షయ్యం, మాచారోహంత్యలక్షణమ్ ॥
(మనుస్మృతి 4-156)

"సదాచారమువల్ల, దీర్ఘాయువు, సత్సంతానముగల్గును. మరియు ఆచారమువల్ల అక్షయ సంపదకల్గును. అశుభలక్ష

ణములన్నియు నశించును." కావున మనము పవిత్రులమగుటకు, భగవద్భక్తులమగుటకు, యథాయోగ్యముగ యత్నించవలెను. ఇట్టి సంపదలను, బంధుజనులను నమ్మి ధర్మము నాచరించకున్నచో నష్టపడెదము. ఎంతో కష్టపడెదము. యథార్థముగ నాలోచించి చూడగా;—

శ్లో॥ మృతంశరీరముత్సృజ్య కాష్ఠలోష్ట సమంక్షితౌ।
విముఖా బాంధవాయాంతి, ధర్మస్తమనుగచ్ఛతి ॥

"బంధువులు, మృతశరీరుని; కట్ట, మంటిపెల్లతో సమానముగ (దేహమును) శ్మశానములో పారవేసి తిరిగివత్తురు. ఒక "ధర్మము" మాత్రమే (ఆత్మ) వెంటపోవుచుండి రక్షించును. ఈ విషయము మనకందఱకు తెలిసినదే. యథాశీఘ్రముగ సదాచారులమై, భగవద్భక్తులమై జీవించుటకు ప్రయత్నించవలెను. లేనిచో మనుష్య శరీరమును దుర్వినియోగము చేసిన, ఆత్మఘాతకుల మగుదుము. ఇచట భగవద్వాక్యమును గమనించవలెను :—

శ్లో॥ నృదేహ మాద్యం సులభం, సుదుర్లభం,
ప్లవం, సుకల్పం, గురుకర్ణధారం।
మయానుకూలేన నభస్వతేరితం,
పుమాన్ భవాబ్ధిః నతరేత్స ఆత్మహా ॥
(భాగ– II – 20 – 17)

ఈ మనుష్యదేహము ఉత్తమమైనది. హరిభజనసేయుటకు సులభమైనది. దుర్గుణములుగలవారికి (తిరిగి) దుర్లభమైనది. సంసారమను సముద్రమును దాటుటకు దృఢమైన 'నౌక' వంటిది. ఆచార్యులు (గురువు) అనే కర్ణధారుడు [నావికుడు]

గలది. [శిష్యుడు సంసారదుఃఖములో మునిగిపోకుండ ఆచార్యుడు రక్షించును.] నేను [భగవంతుడను] స్వయముగ అనుకూలవాయువునై అట్టి శరీరరూపమైన నౌకను, సంసార సముద్రమునుండి దాటింతును. ఇట్టి సదవకాశముండికూడ— ఏ మానవుడైతే విముక్తుడగుటకు ప్రయత్నించడో; అట్టి దుర్భాగ్యుడు "ఆత్మఘాతకుడే యగును." మరియు మనుష్యులలో పురుషులకు, బ్రాహ్మణులకు, ఎంతో ప్రాముఖ్యముగలదు. అట్టివారు అలక్ష్యముచేయక తమ "స్వర్ణావసరము"ను వినియోగించుకొని భగవత్కృపకు పాత్రులు కావలెను.

శ్లో|| జంతూనాంనరజన్మదుర్లభమ, తఃపుం స్త్వంతతో, విప్రతా
తస్మాద్వైదికధర్మ మార్గపరతా, విద్వత్వమస్మాత్పరమ్ ।
ఆత్మానాత్మవివేచనం, స్వనుభవో, బ్రహ్మాత్మనాసంస్థితిః.
ముక్తిర్నో! శతకోటిజన్మ సుకృతైః పుణ్యైర్వినాలభ్యతే||
(శంకర వివేక చూడామణి)

"అన్ని ప్రాణులలో మొదట మనుష్యజన్మమే దుర్లభము. అందులో "పురుషత్వము" లభించుట కష్టము. తరువాత బ్రాహ్మణవర్ణములో నుద్భవించుట అతి దుర్లభము. బ్రాహ్మణుడైనను, వైదిక ధర్మాచరణ గలవాడగుట, దానితోపాటుగ విద్వాంసుడగుట, విద్యగలవాడైనను; ఆత్మజ్ఞానముగలవాడగుట, అందులో అనుభవము సంపాదించుట, అతి కష్టము. అయినను పరమాత్మునియందు స్థిరచిత్తముగలవాడై ధ్యానించుట కఠినతమము. ఇక "ముక్తి" (మోక్షము) యన్నచో ఎన్నోకోట్ల జన్మములెత్తి పుణ్య సంపాదన జేసిననే లభించును.

ఇట్టి స్థితిలో మనము ఏమాత్రము ప్రయత్నము చేయకున్నచో ఎట్టి దశకు వచ్చెదమో, యాలోచింపుడు! ఎట్టి స్థితిలోనున్నను కొంత నీతి, సదాచారము, భగవద్భక్తి లేనివాడు మరల "మనుష్యుడై" జన్మించు నమ్మకము లేదుగదా! మనకున్న సంసార పరిస్థితులను (ఆసక్తిరహితులమై) సవరించుకొనుచు, యథోచితముగ పరోపకారాది ధర్మమార్గానువర్తనులమై, భగవంతునికి సేవచేయుట ఆవశ్యకము. అతనికి ఎట్టి సేవజేసినను ఉచితమే యగును. మొదట మనస్సు భగవంతుని యందు జేర్చుట, భక్తులమగుట, విశ్వాసముగలవారమగుట, కృతజ్ఞులమైయుండుట ముఖ్యము:—

శ్లో॥ మన్మనాభవమద్భక్తో, మద్యాజీమాం నమస్కురు,
మామేవైష్యసియుక్త్వైవ, మాత్మానం మత్పరాయణః ॥
( గీత – 9–34 )

"నాయందు ప్రీతిగలవాడవై, భక్తుడవై, తైలధారవలె అవిచ్ఛిన్నమైన మనస్సుకలవాడవై, సంపూర్ణమైన కైంకర్యాదుల నొనర్చుచు (ఔపచారిక, సాంస్పర్శిక, అభ్యవహారికమనెడి మూడు విధములైన భోగములు సమర్పించుచు) నమ్రుడవై, నేనే ఆశ్రయముగాగలవాడవై యుండుము. ( అపుడు నీవు నన్ను పొందగలవు. )

అని పరమాత్ముడు వచించుటచేతను, మనము అట్టి ఉపదేశానుసారముగ ప్రవర్తించుటకు ప్రయత్నించి, భగవంతునకు ప్రియులము కావలెను. ఎవరైతే భగవంతుని సంపూర్ణ విశ్వాసముతో భజింతురో, అట్టివారు కుల, మత భేదములు లేకుండ, నందరుకూడ "ముక్తి"ని పొందగలుగుదురు. కొం

దరు; మేము తక్కువ వర్ణస్థులము, లేక చదువులేనివారము, లేక స్త్రీలము; భగవంతుడెక్కడ! మేమెక్కడ? భక్తియను నది బ్రాహ్మణులకే కావచ్చును. అందులకు మేము అర్హులము గామేమో! యని తలంతురు. ప్రయత్నము మానుకొందురు. కాని శ్రీకృష్ణుడు, స్వయముగ వచించిన విధమును గమనించ వలెను.

శ్లో॥ మాంహిపార్థవ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః।
స్త్రియో, వైశ్యాస్తథాశూద్రాః, తేపియాంతిపరాంగతిం॥
( గీత - 9-32 )

"అర్జునా! నీచజన్మములు గలవారును, స్త్రీలును, వైశ్యులును, శూద్రులును భక్తితో నన్ను ఆశ్రయించినవా రెట్టివారైనను; ఉత్తమగతిని బొందుచున్నారు."

అనుటవల్ల జాతి, మతభేదములు లేకుండ భగవంతుని సేవించుచు ఇహ, పరములందు సుఖములను అందరు బొంద వచ్చునని స్పష్టమగుచున్నది. ఇక మనము నియమముగా:— భగవంతునకు ఆరాధన, నివేదనలు చేయుటకు ప్రయత్నించ వలెను. అపుడే మనము, గమ్యస్థానము చేరగల్గుదుము. నియ మితముగ భగవదారాధనజేయుటకు తగిన అవకాశము లేక, ప్రపంచ వ్యవహారములందు సంచరించువారుకూడ యథో చిత సేవ జేయవచ్చును.

శ్లో॥ పత్రం, పుష్పం, ఫలం, తోయం, యోమేభక్త్యాప్రయచ్ఛతి
తదహంభక్త్యుపహృత మశ్నామి, ప్రయతాత్మనః ॥
( గీత - 9-26 )

"ఎవడు భక్తితో నాకు, ఆకునైనను, పుష్పమునైనను,

ఫలమునైనను, ఉదకమునైనను సమర్పించుచున్నాడో అట్టి బుద్ధిమంతునిచే భక్తిపూర్వకముగ నివ్వబడిన యా వస్తువులను; నేను ప్రీతితో నారగించుచున్నాను." అని గీతావాక్యము. ఇది గుర్తించి ఎట్టి నియమము లేకుండ, సమయానుకూలముగ పత్రి పుష్పాదులను సమర్పించుచు భగవంతునికి ప్రియులమై యుండవచ్చును. ఈమాత్రముకూడ చేయుటకు శక్తిసామర్థ్యములు లేనివారు మరియు తమ ఆహార, విహార వ్యవహారములలో మునిగి తేలుచున్నవారు, ప్రత్యేకముగ శ్రద్ధతో భగవత్ప్రీత్యర్థము ఏమాత్రము ఖర్చుచేయుటకు ధైర్యము లేనివారుకూడ యథాయోగ్యముగ భగవంతునిప్రీతిచేయుటకు ఉపాయమున్నది. అదెట్లులనిన:—

శ్లో॥ యత్కరోషి, యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వమదర్పణమ్ ॥
[గీత - 9-27]

"అర్జునా! నీవు ఏపని జేయుచున్నావో, ఏపదార్థములను భుజించుచున్నావో (చేయగలిగినవారు) హవిస్సులను, దానములను, తపస్సును, చేయుచున్నను నవి అన్నియు నాకు అర్పణ చేయవలెను." అని శ్రీకృష్ణ భగవానుడు అప్పుడు అర్జునునకు చెప్పినను, ఇపుడు మనకందరినిగూర్చి చెప్పినట్లుగా నేయున్నది. ఎప్పుడో చెప్పిన ఉపదేశములు మనకు వర్తించునా? యని సంశయింపరాదు. భగవంతుడు అర్జునిని నిమిత్తమాత్రునిగ జేసి సర్వమానవకల్యాణముకొరకే దయతో నుపదేశించినాడు.

కావున మనము విశ్వాసముగలవారమై ఏదో ఒక సన్మార్గము నవలంబించి భగవత్సేవ చేయవలయును. ఇప్పటివరకు ఎట్టి దురాచారములు కలవారైనను మేము ఇక పతన

మొందవలసినదే! యని నిరుత్సాహపడక ఇప్పటినుండైనను సదాచారులై, సాధుపురుషులై భగవంతునకు ప్రియులు కావచ్చును.

శ్లో|| అపిచేత్సుదురాచారో, భజతేమా మనన్యభాక్ ।
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః ||
( గీత – 9-30 )

"తన జాతికి తగిన యాచారము లేకున్నను, నాకు మంచి వనబడు (చెడు) కర్మలు చేయుచున్నచో, [ఇతర ధర్మాది సాధనములకంటె నన్ను ఆశ్రయించుటకే ప్రాధాన్యమును సూచించుచుండువాడు] నన్ను మనస్ఫూర్తిగ భజించుటయను ఒకే ప్రయోజనముగలవాడై ఇతరములను విడిచి, నన్ను తనకు గొప్ప భోగ్యుడని తలంచి, ఆత్మజ్ఞానము కలవాడగుచు [ఆశ్రయించుచు]న్నాడు. అట్టివాడు నాయందు గట్టి నమ్మకము గలవాడు గాపున సదాచారముగలవాడే యగును." [పాపములనుండి విముక్తుడగును.] దానికి శాస్త్రను, ప్రభువును నేనే" అని భగవంతుడు కరుణామయుడై పతనమొందినవారినికూడ ఉద్ధరించు నుద్దేశ్యముకలవాడై పై విధముగ తగిన యవకాశమును కల్పించియున్నాడు.

మనము ఇప్పటికైన సద్బుద్ధిగలవారమై, భగవదుపదేశము లందువిశ్వాసమునుంచి, భగవద్గీతల నధ్యయనము జేయుచు, సదాచారులము కావచ్చును. పవిత్రత నొందవచ్చును. ఈ లోకములోనున్న మనకందరకు భగవద్గీతలు ఎట్టి యమూల్యమైనవో "శ్రీ వేదవ్యాస భగవానుడు" వ్యక్తపరచినాడు :—

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సః, సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥

"అన్ని ఉపనిషత్తులు ధేనువులుగాను, పాలు పితుకువాడు శ్రీకృష్ణుడుగాను, అర్జునుడు లేగ [వత్సము] వంటివాడును; ఇట్లు ఆ ధేనువును పితకగా లభించిన గీతోపదేశములే అమృతసమానమైన క్షీరములు; అవి యనుభవించువారు 'బుద్ధిమంతులు' అని భావము."

కావున మన జన్మప్రాముఖ్యమునుగురించి భగవంతుడు మన కందఱకు పరమ కృపతో నుపదేశించిన పవిత్ర దైవీగుణములను అలవరచుకొని, సదాచారులమగుటకు తగిన ఉపాయములను సూచించిన పరమాత్మునకు కృతజ్ఞులమై, భక్తులమై, అతనికి, యథాశక్తిని సేవజేయుటకు ఇక బూనుకొందము. మన ప్రయత్నమునకు సర్వేశ్వరుడైన, శ్రీమన్నారాయణుడు దివ్యమైన (ఆత్మ) శక్తిని కృపజేయుగాక." యని ప్రార్థించుచున్నాడను.

సజ్జన విధేయుడు;

కలవకుంట; కృష్ణమాచార్య.

# సమర్పణము

శ్రీహారీతవంశోద్దీపకులును; సద్భావప్రేరిత సర్వజన కీర్తిత పవిత్ర చరిత్రులును; అనన్యార్హభోగ్యత్వాది వాత్సల్య గుణోపేతులును,

శ్రీ లక్ష్మీనారాయణ స్వరూపులునగు:

శ్రీమతి ఆండాళమ్మగారు; శ్రీమాన్ వేదాంతాచార్యులుగారు;

అను

మదీయ "మాతాపితృలకు" భక్తిపూర్వకముగా సమర్పితము.

— గ్రంథకర్త.

శ్రీ పరమాత్మనేనమః
శ్రీమన్నృసింహా గురవేనమః

# యథార్థ మానవత్వము

(—)

—[ స్తుతి ]—

శ్లో॥ నారాయణం నమస్కృత్య, నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం, వ్యాసం, తతో జయముదీరయేత్ ॥

---

దేవత్వము, మానవత్వము, రాక్షసత్వము అనునవి ఊహాపోహాలుకావు. అవి సశాస్త్రీయములు. సత్వ, రజస్తమోగుణ విశిష్టములు. ఆ గుణస్వరూపములేవి ? వానివిషయమై తెలిసికొందము.

సమాజములోని కొందఱు మనుష్యులలో శాస్త్రవిహితముగా, ధార్మిక జీవనము గడుపుచు, సత్యాన్వేషణచేయుచు సర్వమానవకల్యాణము నభిలషింతురు. అట్టి [దైవీగుణములు వికసించిన] వారు మనుష్యులేయైనను, పై గుణములవల్ల, "దేవత్వము"ను సంపాదించినవారే యగుదురు.

మరికొందఱు; స్వభావముతో జీవహింస, అసత్యము, క్రోధము, వ్యభిచారము మొదలగు అసురకృత్యములు చేయుచుందురు. అట్టివారు మానుష శరీరధారులైనను "రాక్షసత్వము" నొందినవారగుదురు.

పై రెండువిధములగు గుణసంపదలలో దైవీగుణముల

నలవరచుకొనుటకు ప్రయత్నించి, యథాయోగ్యముగ ధార్మిక జీవనము గడుపువారే "మానవత్వము" గల మనుష్యులనబడుదురు.

"దైవీగుణములు" మానవునకు దివ్యమైన శక్తిని ప్రసాదించునవి; మరియు ఆత్మశక్తిని గల్గించి, భౌతిక దుఃఖములను దొలగింపచేసి సుఖవృష్టి నొసంగునవి. భగవంతుడు సర్వప్రాణులను సృష్టించినను, మానవునిలోవలె వివేకము, ధార్మిక స్థితిని వికసింపజేయు మనఃప్రవృత్తిని ఇతరప్రాణులలో కల్పించలేదు. ఎప్పుడైతే మానవునిలో [దైవీగుణములు] ధార్మిక సంపద వికసించునో అప్పుడే "మానవత్వము", దాని చరమావస్థయే "దైవత్వమ"నబడును. అవి ఏయేగుణములు ? ఎట్టి విశిష్టతగలవి? వేనిని సాధించుటవల్లమనుష్యుడు యథార్థముగ మనుష్యుడగును ? వివరముగా తెలిసికొందము:

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీత 16వ అధ్యాయములో మానవునిలో నుండవలసినవి, వికసింపజేసికొనదగినవి యగు "దైవీగుణముల" ప్రాముఖ్యమును వ్యక్తపరచియున్నాడు. ఆ గుణము లెవ్వియో స్పష్టీకరించియున్నాడు. ప్రతి మనుజుడు "యథార్థమగు" మానవత్వమును సాధించు నుద్దేశ్యము కలవాడై భగవంతుని దివ్యోపదేశములను శ్రద్ధతో మననము జేయువలయును. ఎవరైతే సహజముగా ధర్మమార్గవర్తనులో, భగవద్భక్తులో, వారిలో దైవీగుణములు అనివార్యముగా శీఘ్రముగనే వికసించును. అట్టివారు ధన్యులు! నూతనముగా సాధన ప్రారంభించువారిలో నట్టి సద్గుణములు యథాయోగ్యముగ సమావేశమై, పవిత్రత నొందించును. ఏ వ్యక్తియైతే నేను ? ధార్మిక బుద్ధి వికసింపనిచ్ఛగించునో అతడు ప్రతి దిన

ము శాంత మనస్కులై భగవద్గీతల నధ్యయనము జేయుట లాభదాయకము. అందులో నుపదేశించిన విధానములను, విచారశీలురై, మననము చేసి (ఆచరణములో) కర్తవ్యనిష్ఠ కలవారగుదురో, వారిలోనే మానవత్వమునకు, యథార్థస్థాన ముండును. రాక్షసప్రవృత్తులు, దుర్గుణములు క్రమముగా, విడిపోవుననుటలో సందియము లేదు. ప్రకాశము వ్యాపించిన చోట నంధకారము తొలగిపోకయుండునా!

## మనుష్యునిలో నుండవలసిన దైవీగుణములెవ్వి?

పరమాత్మయైన శ్రీకృష్ణుడు పార్థునితో నిట్లనెను, అర్జునా! దైవీగుణములు ఏమనుష్యునకైతే ప్రాప్తములగునో అట్టివాడు మానవత్వమును వికసింపజేసికొనగల్గును. ఆత్మ శక్తిని పొంది పవిత్రుడగును. అట్టి దైవీగుణములు ఈక్రింది విధముగానున్నవి :—

శ్లో॥ అభయం, సత్వసంశుద్ధి, ర్జ్ఞానయోగ వ్యవస్థితిః ।
దానం దమశ్చ, యజ్ఞశ్చ, స్వాధ్యాయ స్తపఆర్జవమ్ ॥
అహింసా, సత్య, మక్రోధస్త్యా గశ్శాంతిరపైశునమ్ ।
దయాభూతే,ష్వలోలు ప్త్వం,మార్దవం,హ్రీ,రచాపలమ్॥
తేజః, క్షమా, ధృతి, శ్శౌచమద్రోహో, నాతిమానితా।
భవంతి సంపదమ్ దైవీ మభిజాతస్యభారత ॥
( భగవద్గీత – 16 – 1, 2, 3. )

అనగా:- నిర్భయము, అంతఃకరణ పరిశుద్ధి, తత్వజ్ఞానమందు దృఢబుద్ధి, సాత్వీక దానము, దమము (ఇంద్రియనిగ్రహము) భగవత్పూజ, (యజ్ఞము) ధర్మగ్రంథ పఠనము; భగవద్గుణకీర్త నము, (తపస్సు)- స్వధర్మపాలనాత్మక కష్టసహనము, అహింస,

సత్యము, కోపము లేకుండుట, త్యాగము, శాంతియు, పర నిందజేయకుండుట, సర్వ ప్రాణులయందు దయ, ఇంద్రియ సుఖాసక్తి లేకుండుట, సరళమైన స్వభావము, శాస్త్రవిరుద్ధ కార్యాచరణమందు లజ్జ: చపలత్వము లేకుండుట, మరియు తేజస్సు, ఓర్పు, ధైర్యము, సదాచారము, వైరభావము లేకుండుట, అభిమానము (గర్వము) లేకుండుట— మొదలగు గుణములు, దేవాంశముతో జనించినవానిలో నుండును. (అట్టివాడే యథార్థమగు మానవుడనబడును.)

పై నుదహరించిన శ్లోకములలో పరమాత్మయగు శ్రీకృష్ణుడు "యథార్థ మానవత్వమున" కవసరమగు అమూల్యమైన గుణభావములను వ్యక్తపరచియున్నాడు. అట్టి గుణముల నలవరచుకొనుటకు మనము ప్రయత్నించుటవల్ల, నరకములను బొందకుండ, మానవత్వమనే యథార్థశక్తిని సంపాదించగల్గినవారమై, ప్రాపంచికమందు, యశోవృద్ధి— సుఖప్రాప్తినొందుటయేగాక, పవిత్రులమై, ఆత్మజ్ఞానముగలవారమై, యానందించగలుగుదుము. కావున నట్టి దైవీగుణముల (వేర్వేరుగా) నొక్కొక్కదానిని విపులముగా విచారించి తెలిసికొందము.

## 1. నిర్భయముగా నుండుట :—

"భయము" మనుష్యునకు శత్రువువంటిది. ఆత్మశక్తిని గోరువాడు భయమును త్యజించవలెను. నిర్భయమే స్థిరబుద్ధిని వికసింపజేయును. సంశయ భావములనుండి విముక్తినొందించు మనోనిశ్చలతను కలిగించును. మనుష్యుడు ఆశాపాశబద్ధుడై, అనేకములగు కోరికలుగలవాడై, కపటముచేతనైనను ధనమును సంపాదించును. అట్టి సంపదను అనుభవించుట

కవకాశము గల్గినను, ఇతరులకు ఎపుడు తెల్యునో! ఎవరు తెలిసి కొందురో, కనుగొందురో! ఎవరు లాగుకొందురో! యను భయముచేత పీడితుడగుచుండును. అట్టి దుష్కృత్యమును కప్పిపుచ్చి, సమర్థించుకొనుటకు కొన్ని అబద్ధములుకూడ కల్పించుకొని వెలిచుచుండును.

ఇదేవిధముగా పలువిధములైన కారణములచేత, భయమనే అగ్నిచే లోలోపల దహింపబడును. సమాజములో ప్రస్తుతము, ఏకొందరైనను, నాగరికత, విజ్ఞానము, అభివృద్ధి నొందించుకొనుట, విశాలహృదయము, శాంతియు కావలెనని, తాము అందుల కాదర్శులమని భావించి, వాదించుచున్నను; వారి హృదయములు; సంకుచితములై, ఏదోరకమైన భయముచేత పీడింపబడుచున్నవనుటలో అతిశయోక్తిలేదు. ఉదా:— గౌరవముగలవారికి అవమానమగునని భయము, కొందఱకు స్త్రీలవల్ల భయము, ధనముపోవునని భయము, దారిద్ర్య భయము, తన పన్నాగము ఇతరులకు తెల్యునను భయము, సంతానములేకున్న భయము, ఆరోగ్యము చెడిపోవు భయము, ఉద్యోగముపోవు భయము, మృగములచే భయము, శత్రుభయము, మృత్యుభయము, ఇట్లు నానారకములైన భయములతో మనుష్యుడు బాధపడు వాతావరణములో నున్నాడు. విపరీత పరిస్థితులవల్ల ఎన్నో నీచకార్యములను జేయుచు కొందరు ఆసురభావము నొందుచున్నారు.

అట్టివారికి అప్పుడప్పుడు ఆత్మపరితాపము కల్గుచుండును. కాని మోహావశులై ఆసురభావమును విడచుటకు ప్రయత్నించకుందురు. అట్టివారికి భగవంతునిఆశ్రయముకాని, సహాకారముగాని లభింపదు.

శ్లో॥ నమాందుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానాః ఆసురం భావమాశ్రితాః ।
[ గీత - 7-15 ]

భావము:- "అజ్ఞానము" అను మాయచేత బుద్ధివిహీనతి నొందిన మనుష్యాధములు నాయొక్క, ఆశ్రయమును బొందజాలరు- అని కృష్ణపరమాత్ముడు స్పష్టముగ జెప్పియున్నాడు.

భయమునకు కారణములు; భ్రమ, అత్యాశ, కష్టపరిస్థితులను ఎదుర్కొనలేకపోవుట, మొదలగునవి యగును. కావున, సత్యభాషణము, సత్ప్రవర్తనము, అన్ని పరిస్థితులను సహానముతో నెదుర్కొనుట మొదలగు గుణములుగలవానికి భయమనునది కల్గనేరదు. మరియు మనుష్యుడు (శరీరముదాల్చిన) "ఆత్మ" గదా! నిష్కళంకుడు, భగవదంశగలవాడు. సత్ప్రవర్తనగలవానికి భయమెక్కడిది ! భగవదంశసంభూతునకు భయమెందులకు ?- మనము భయమును త్యజించుటకు ప్రయత్నించవలెను.

సామాజిక, సాంసారిక వ్యవస్థలవల్ల కొన్నిపీడలుగల్గుట, మనకు సామాన్యమే. ఐనను వానివల్ల సహజముగా నెట్టినష్టముండకపోవచ్చును. కాని మన'భ్రమ'వల్లనే ఎక్కువభయము కల్గుచున్నది. ఇది ఒక దురభ్యాసమని తలంచవలెను. మరియు మనుష్యుని అజ్ఞానమువల్ల- చెడుకర్మలు, చెడుకర్మలవల్ల- పాపము; పాపమువల్ల భయము కలుగును. కావున వివేకముగలవారమై, సత్ప్రవర్తనులమై, నిర్భయులమగుట ప్రథమ కర్తవ్యమని యెంచవలెను. వేదములు, ఉపనిషత్తులు, మనము నిర్భయులమగుటకు ఉపదేశించియున్నవి. "ఎట్లైతే ప్రపంచ

ములో ఆకాశమునకు భయములేదో, వాయువునకు భయము లేదో, భూమికి భయములేదో; సూర్యచంద్రులకు భయము లేదో, అట్లే పంచభూతాత్మకమైన శరీరముగల మానవులకు భయముండకపోవుగాక" అని నిశ్చయించియుండక, మనమేల అశుభమును కోరుచు, కష్టపడెదమనియు, నష్టపడెదమనియు ఎందులకు భావించవలయును! సర్వదా శుభాకాంక్షులమై యుండవలెను.

"ఆనోభద్రాః క్రతవోయంతు విశ్వతః" (ఋగ్వే. 1-8-89)

"అన్ని వైపులనుండి మనకు విలువైన సద్భావములు వచ్చుగాక" మరియు "తమేవవిద్వాన్ నబిభాయమృత్యోః" (అధ- 10-8-44) ("తనలోనున్న ఆత్మను తెలిసికొన్నతరువాత- మృత్యుభయముండదు") అని శ్రుతులందు జెప్పబడి యున్నందున, సాధ్యమైనంతవరకు నిర్భయుడై యుండుటకు ప్రయత్నించవలెను.

మరియు మనుష్యుడు ప్రపంచములో, అన్ని ప్రాణుల పై యధికారముకల్గి జీవించువాడు. ఉత్కృష్టమైన జ్ఞానము గలవాడు, దేవతలుకూడ కోరదగిన శరీరముగలవాడగుటచే తను, భయము వీడవలెను. ఇట్టి మానసికశక్తి గలుగుటకు, అన్ని భయములు నివారణమగుటకు శ్రీహరిని స్మరించుట యను ఉత్తమ సాధనముగలదు:—

శ్లో॥ శ్రీమన్నృసింహవిభవే! గరుడధ్వజాయ,
తాపత్రయోపశమనాయ, భవౌషధాయ,
తృష్ణారి, వృశ్చిక, జలాగ్ని, భుజంగరోగ
క్లేశవ్యయాదిహరయే, గురవేనమోస్తు॥

(శ్రీ ల॥ నృ॥ స్తోత్రము)

అని భగవంతుని స్మరించుటవల్ల మనకు అన్ని భయము లనుండి విముక్తులమై, పవిత్రులమగుటకు మార్గము కలదు. కావున "నిర్భయము" గలవారమగుటకు ప్రయత్నించవలెను.

## 2. స్వచ్ఛమైన హృదయము గలవాడగుట:-

"మానవత్వమును" సంపాదించుటకు మనము కపట ములేని (మనస్సు) అంతఃకరణము గలిగియుండవలెను. మను ష్యుని పతనమొందించు గుణములలో కపటము (దంభము) కూడ ప్రమాదకరమైనది. తలంచునది ఒకటి, చెప్పునది ఇం కొకటి, చేయునది వేఱొకటిగా నుండరాదు. ఇట్టిగుణమున కలవడిన వ్యక్తి కృత్రిమభావము గలవాడై, కొద్దిరోజులు గౌ రవమొందినను, నిజము నిలుకడమీద బయటపడి, అపకీర్తి నొందును.

కావున మనకు శ్రుతులు, స్మృతులు, పురాణములు, బోధించినట్లు త్రికరణశుద్ధిగా ప్రవర్తించవలెను. త్రికరణ ములనగా:— మనస్సు, మాట, కర్మ(పని) చేయుట; వీనిలో మార్పు లేకుండా నుండుట," యని భావము. సత్యప్రవర్తన మానవునకు దివ్యమైన శక్తి నొసంగును. అట్లే కృత్రిమరహి తమైన మనస్సువల్ల, మాటవల్ల, కర్మవల్ల, ఆత్మశక్తి వికాస మొందును, నేటి సమాజములో కొందఱు కృత్రిమమైన భావ ముచేత, మాటలచేత, ఆచారముచేత పైపైకి మాత్రము వస్త్ర, భూషణ, స్వరూపములచేత యోగ్యతను కనబరచుచు, డంబాచారులగుచున్నారు. అంతఃకరణ, స్వచ్ఛతను గురించి మరచిపోవుచున్నారు. యథార్థశక్తిని కోల్పోవుచున్నారు.

మానవుడు సర్వదా సద్భావముగలవాడై, ఇతరులను

మోసగించక, నిష్కల్మషమైన మనఃప్రవృత్తి కల్గియుండవ లెను. "తన్మేమనః శివసంకల్పమస్తు" అని యభిలషించుచు; అహంభావమును, స్వార్థబుద్ధిని త్యజించవలెను. మనస్సును ధార్మికచింతనయందు చేర్చి ఆత్మజ్ఞానము కలవాడై, పరులను తిరస్కరించుటమాని, ఆహార విహారములందు నియమముగల వాడై తమోభావము కల్గించు వాతావరణమునకు దూర ముగనుండి, అన్యాయార్జితము చేయక; తాను ఆచరించినరీతి ఇతరులను ఆచరింపజేయుచు; ఇతరులకు బోధించిన నీతియుక్త ముగా తాను ప్రవర్తించుచుండుటవల్ల మనుష్యుని అంతఃకర ణము నిర్మలమగును:— మరియు ఈ క్రింది వేదసూక్తులను గమనింతము:—

—"భద్రంకర్ణేభిశ్శృణుయామ" (యజు- 25—21)
'మనము చెవులతో మంగళప్రదమైన సూక్తులు విందుముగాక'

—"భద్రంభద్రం క్రతుమస్మాసు దేహి" (ఋగ్వే- 1-123-21)
'ప్రభో, మాకు శుభసంకల్పములను గల్గునట్లు జేయుము'

—"అహ మనృతాత్సత్యముపైమి" (యజు- 1-5),
'నేను అసత్యమునుండి విముక్తినొంది, సత్యము నాచరింతు నుగాక'...

ఇన్నిటిభావము; మన హృదయము నిర్మలముగానుంచు టకు సదా ప్రయత్నించి, అంతఃకరణము శుద్ధముగా చేయ వలెను.' అనియేగదా! మనకు పతంజలి మహర్షి కూడ సూ చించినాడు. అట్టి ప్రవృత్తులుగూడ గమనార్హములు- అవి ఈ విధముగా నున్నవి:—

1. మైత్రి:— తనతో సమానమైన వ్యక్తితో మిత్రభా

వముగలవాడై, కష్టకాలమునందు వారికిని సానుభూతి గనబఱు చవలెను.

2. దయ (కరుణ)— హీనస్థితిలో నున్నవారిని పరామర్శించి, సహాకరించి, వారి దుఃఖమును మరపించుటకు ప్రియత్నించవలెను.

3. సంతోషము:- ఇతరులు సుఖముననుభవించగా, విజయమొందగాజూచి సంతసించవలెను.

4. ఉపేక్ష:— ధర్మదూరుడు, నీతివిహీనుడు, ఈర్ష్యగలవాడైనచో బంధువర్గములోనివానినైనను, గౌరవింపక నుపేక్ష చేయవలెను.

ఇట్లే స్వచ్ఛమైన హృదయముగల వ్యక్తి, అన్నివేళలందు, యథార్థత కనబరచుచు, ఒకేరీతిగా మెలగుచుండును. కృత్రిమరహితమైన జీవితములో (అన్యాయ, ద్వేషములేనివాడై) సంతృప్తి, శాంతి ననుభవించును. కావున, అట్టి దశ నొందుటకు మనము ప్రియత్నించవలెను.

## 3. పరమాత్మయందు [ధ్యానము] నిశ్చలత:—

అన్నియవస్థలయందు భగవంతుని విషయము- (ధ్యానయోగము) నందు మనస్సును చేర్చి, అతని కల్యాణగుణములను మననముచేయుట, విశ్వాసమునుంచుట యనునది దైవీగుణములలో ముఖ్యమైనది. ఈ స్థితివల్ల మనుష్యునిలో కొన్ని సద్గుణములు సహజముగా వచ్చును. మానవత్వమును వికసింపజేయును. కావున మనము ఇష్టదేవతా, ఆరాధన, కీర్తనలవల్ల కొన్ని సాంసారిక ఫలితములను పొందుటయేగాక, ధ్యానమువల్ల అంతస్సులో భగవంతుని దర్శించగలుగుదుము.

మనకు తెలియకుండా ఏదో దివ్యమైన శక్తి, ధైర్యముకూడ మనలో పనిచేయుచుండును. కావున భగవధ్యానము ఉత్తమ మైనదని గ్రహించవలెను.

కొందరు మహాత్ములు, తమకు ధన, ధాన్యములు, రాజ్య భోగములు, స్వర్గభోగములు, తుదకు మోక్షమునుకూడ (లెక్క-చేయక) కోరక- ఎల్లప్పుడు భగవంతునియందే తమ మనస్సు (చిత్తము) నుండునట్లు ప్రార్థించియున్నారు. భగవంతునియందు నిశ్చలచిత్తము గలవారికి, సుఖ-దుఃఖములు, పాప-పుణ్యములన్న: మోహ-భీతులుండునా? మనము కుల శేఖర సూక్తులను గమనించవలెను:—

శ్లో|| నాహంవందే, తవచరణయోర్ద్వంద్వ మద్వంద్వహేతోః
కుంభీపాకం గురుమపిహరేనారకం నాపనేతుమ్।
రమ్యారామామృదు తనులతానందనే నాపిరంతుమ్,
"భావేభావే హృదయభవనే భావయేయం, భవంతమ్||
నాస్థాధర్మే నవసునిచయే; నైవకామోపభోగే,
యద్యద్భవ్యం భవతి భగవన్ పూర్వకర్మానురూపం।
ఏతత్ప్రార్థ్యం మమబహుమతం జన్మజన్మాంతరేపి,
త్వత్పాదాంభోరుహ యుగగతానిశ్చలాభక్తిరస్తు||
(ముకుందమాల — 4, 5)

భావము:— ముకుందా! నీ చరణకమలములకు నేను నమస్కరించుట; కుంభీపాకాది నరకములను బాపుటకుగాని, రమ్యమైన పూదోటలయందు కామోపభోగము లందుటకుగాని గాదు; మరియెందుకనగా; ఏయేజన్మలెత్తినను, నా హృదయమందు నీపైగల భావము (ధ్యాననిశ్చలత) మాత్రముండుటకు నమస్కరించుచున్నాను.

"మరియు భగవన్! ధర్మా-ధర్మములందు నాకు ఆసక్తి లేదు. సాంసారిక సుఖములను గోరను. పూర్వ కర్మానుసారము ఎట్లు అనుభవింపవలసివచ్చునో రానిమ్ము; ఇక నేను ప్రార్థించి కోరున దేమనగా; జన్మజన్మాంతరములందుకూడ నీ పాదపద్మములందు స్థిరమైన భక్తి యుండుగాక!"

పై విధమైన భావనకల్గుటకు మనలో, భగవంతునిగూర్చి, తైలధారవలె శ్రద్ధాసక్తులు కావలసియుండును. శాంతమనస్కులై, కనులు మూసికొని మానసిక పూజకూడ చేయవలెను. రానురాను సంశయములుబాసి, ఆత్మశక్తి వృద్ధినొందును. సహజముగా కొన్ని సద్గుణములు ప్రకాశించగల్గును. కావున మానవులందరము భగవంతుని సృష్టి (ప్రపంచము) లో ఫలితముల ననుభవించుచున్నందులకు, అతనికి కృతజ్ఞులమై సర్వాంతర్యామి యగు సాకారస్వరూపుడగు "పరమాత్మ"ను ధ్యానించుచుండవలెను.

## 4. దానము చేయుట :—

"మానవత్వము"ను పోషించగల్గుటకు మనకున్నంతలో (శక్తిననుసరించి) శక్తి-సంపదలను, అర్హులగువారికిచ్చి, సహకరించవలెను. దానినే "దానమం"దురు. వీనిలో పలువిధములైన దానములు గలవు. విద్యాదానము, అన్నదానము, భూదానము, గోదానము, వస్త్రదానము, సంపత్తిదానము, శ్రమదానము, మొదలగునవి.

మహాత్ములన్నారు:—

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ రాజన్ స్వర్గస్యోపరితిష్ఠతః,
ప్రభుశ్చక్షమయాయుక్తో; దరిద్రశ్చ ప్రదానవాన్॥

"రాజు, శిక్షించు నధికారమున్నప్పటికిని క్షమించు వాడు, దారిద్ర్యములో నున్నప్పటికిని [కల్గినంతలో] దానమొసంగువాడును; వీరిరువురును స్వర్గమునకంటె నుత్తమమైన పదమును బొందగలుగుదురు."

మరియు– "దక్షిణావంతో అమృతంభజంతే"

[ ఋగ్వేదము ]

– "దాతయైనవాడు అమృతము [స్వర్గము] ను బొందును."

అను ప్రమాణవచనములేకాక మనము విచారించి చూచినచో, సమాజములో, ప్రతివ్యక్తి తాను ఇతరులకొసంగినన్నే, తనకు ఇతరులవల్ల వివిధములైన సహాకారములు పొందగల్గుచున్నాడు. ఇట్లు భగవంతుని సృష్టిలో కానవచ్చును. "పెట్టిపుట్టవలయు" నను సామెతకూడ మనము వినుచున్నాముగదా! వ్యక్తిగతమేగాక ఒక దేశమునుండి వేరొక దేశమునకు సహాకారము [దానము] లభించుటవల్లనే, నేడు ప్రపంచములో కొంతవఱకు ఐక్యభావము; శాంతియుతమై నిలిచియున్నది. లేనిచో జనులు, దేశములు నశించును. ఇంతే-గాకుండ ఉపకార స్వభావముగల, గాలి–వీచుట, నదులు-బావులు నీరొసంగుట, వృక్షములు; ఆకులు, పుష్పములు, ఫలములు, కట్టెనొసంగుట, మేఘములు- వర్షించుట, భూమి-ధాన్యముల నొసంగుట, సూర్య చంద్రులు– ప్రకాశము నొసంగుట, తల్లిదండ్రులు– తమ శక్తినొసంగి [పిల్లలను] పెంచుట మొదలగునవి యన్నియు, దాన [కార్య] ములే యగును. ఇవి మానుకొన్నచో ప్రాణులు, ప్రపంచము నిలుచునా! [నిలువనేరదు].

"భగవంతుని సృష్టి" దాన తత్వమయముగా నున్నది.

సహకార భావమువల్లనే నడచుచున్నది. ప్రతివ్యక్తి ఏదో దానముచేసితీరవలెను. దానముచేయుటవల్ల మనుష్యుడు నిత్యజీవితములో నియమము, ఉన్నదానిలో సంతృప్తినొందుట, శాంతిననుభవించుట మొదలగు గుణముల కలవడి, సాత్విక స్వభావముగలవాడగును. "విద్యాదులు ఇతరుల కొసంగుట వల్ల అభివృద్ధిజెందును. శాస్త్రవిహితముగా అర్హులైనవారికి, ఉత్తమ దానములను చేయువారు ప్రపంచములోకీర్తి, తర్వాత స్వర్గసుఖముల నొందుదురు. కాని ఇట్టి సాత్విక దానము చేయువారు అరుదైపోవుచున్నారు.

ఐనను సాధారణముగా, మనదగ్గర పాతవస్త్రములు, ధాన్యము, పైసలు ఏకొద్దిమాత్రమైన నుండును. అవిలేనివారికి ఇచ్చుట (సహకరించుట) కూడ దానమగును. ఇచ్చినదాత; తీసికొన్నవాడు సంతసించుచుండగా జూచి ప్రత్యక్షములో అమితానందము నొందగల్గును. శాంతి ననుభవించును.
ఉదా:- ఒక యాచకుడు వస్త్రవిహీనుడై, చలికి బాధపడు చుండగా మనము జూతుము. వాని స్థితికి హృదయము ద్రవించునుగదా! వెంటనే ఒక పాతవస్త్రము నొసంగవలెను. దానిని బొంది, వాడు పోయిన ప్రాణములు లేచివచ్చినట్లు ఎంతో సుఖము ననుభవించును. కృతజ్ఞత కనబఱచును. అప్పటివాని ముఖలక్షణమును జూచి మనకు సంతృప్తి కలుగును. కావున అనవసరముగా పడియున్న వస్తువులను సంగ్రహము చేయక, అర్హులగువారికి ఇచ్చుట, సదుపయోగము చేయుట అందరకు అనుకూలమైన మార్గము.

ఎవరైతే సంపదలున్నను లోభత్వముచేత, ఇతరులకు అవసరములందు నొసంగరో, వ్యయభయముచేత తాముకూడ

అనుభవింపరో; అట్టి మనుష్యులు పెద్దచేనిలోనుండు "బెదరు బొమ్మలు" లేక రక్షకభటులని మాత్రము తలంపవలెను. తాము అనుభవించుటకు, దానముచేయుటకు, ఇపుడెవరైతే వెనుదీయుచున్నారో; వారు ఇకముందుకూడ అనుభవించలేరు, సంతృప్తిబొందలేరు. "తృష్ణ" యను నీటిలో మునుగుచుందురు. మానవుడు ఉదారుడై, ఉపకారుడై మెలగినచో నట్టివానికి నీతియుతమైన సంపాదనలో భగవంతుడే అభివృద్ధి నొందజేయును. ప్రపంచములో కీర్తివంతుడగుటయేగాక, ఉత్తమపదమునొందుట కర్హుడగును. కొందరు స్వస్తుతికోరకై అభిమానపూరితులై పేరు ప్రఖ్యాతులకొఱకు, సత్రములు గట్టింతురు. ఉన్నతాధికారుల మన్ననల నందుటకు స్వార్థబుద్ధితో "విందులు" జేయుదురు. కాని అట్టిదానిని దానమనరాదు. స్వచ్ఛమైన హృదయముతో ఆకలిగొన్నవానికి పిడికెడన్నము పెట్టువాడే ఉత్తముడు. దేశ, కాల, పాత్రముల ననుసరించి ఇచ్చువాడే నిజమైన దాత.

శ్లో॥ దాతవ్య మితియద్దానం దీయతేఽనుపకారిణే,
దేశేకాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥
(భగవద్గీత-17-20)

—దేశ, కాల, పాత్రములను (అర్హతను) గుర్తించి ఉపకారబుద్ధితో (కారణము) లేక ఈయవలెనని (యాచించకుండగనే) ఇచ్చుదానము "సాత్త్విక దానము" నబడును.

మానవుడు దానముచేయుటవల్ల, త్యాగశీలుడై, సంసారపీడలకు దుఃఖింపక శాంతిననుభవించగల్గును. వైరాగ్యమునందు అభిరుచిగలవాడై, క్రమముగా "అహం" భావము, స్వార్థము, అసూయ, మోహము, అనువానిచే (ప్రపంచవ్యవ

హారములలో పాల్గొనుచున్నను) విడువబడి పవిత్రుడై ఉత్తమ సుఖమునొందుట కర్హుడగును. కావున మనము దానశీలురమై జీవించుటకు యథాశీఘ్రముగ ప్రయత్నించవలెను.

## 5. దమము (ఇంద్రియ నిగ్రహము) :-

మనము యథార్థముగ మనుష్యులము కావలెనన్నచో, ఇంద్రియములను కదలనీయకుండ (ఇంద్రియవశులము కాకుండా) వానిని స్వాధీనములో నుంచుకొనవలెను. శాస్త్రవిహితములైన భోగములను మాత్రమే, అనుభవించుచు, నిషిద్ధ కార్యములు చేయకుండ నుండుటకు ప్రయత్నించుట చాల ముఖ్యమని తలంచవలెను.

"పురుషుడు" శరీరరూపమైన రథమునకు, కూర్చిన "ఇంద్రియము"లనబడు అశ్వములను తన ఆధీనములో నుంచుకొని, నియమిత "ధర్మమార్గమున" నడిపించుచు; జీవనయాత్ర సాగించు సామర్థ్యముగలవాడు. ఇట్టి సామర్థ్యము అన్నిప్రాణులలో; ఒక మనుష్యులకు మాత్రమే ప్రత్యేకముగా భగవంతునిచే అనుగ్రహింపబడినది. ఇట్టి ప్రాముఖ్యమును గుర్తించి ఇంద్రియములను "అశ్వములను" అదుపులో నుంచుకొనకున్నచో నవి (శరీర) "రథమును" పతనమొందింపక మానవు. కావున, వీని విషయములో అతి జాగరూకతవహించి శాస్త్రసమ్మత కార్యములందే యాసక్తి గల్గియుండవలెను.

ఇంద్రియములు రెండు విధములు:— 1. జ్ఞానేంద్రియములు. 2. కర్మేంద్రియములు. జ్ఞానేంద్రియములనగా:— చర్మము, నేత్రము, చెవులు, నాలుక, ముక్కు ఇవి యైదు. కర్మేంద్రియములనగా:— చేయి, కాలు, వాక్కు (నోరు),

గుదము, ఉపస్థ, ఇవిదైయిదు.. వీనిలో బాహ్యకర్మలకే ప్రాధాన్యముగల కర్మేంద్రియములకన్న అంతర్భావ ప్రాధాన్యముగల "జ్ఞానేంద్రియములే" చాల చంచలమైనవి. వీనిపై 'నియంత్రిణ' లేకున్నచో మానవుడు పతనావస్థనొందును. ఆరోగ్యమును, బుద్ధిని కోల్పోవును.

వివేకముతో నింద్రియ నిగ్రహము చేసినవారే నిజముగా సదృష్టవంతులు, సుఖవంతులు. అట్టిసాత్విక తేజఃసంపన్నులకు, ఆత్మజ్ఞానము కలుగును. తాబేలుమాదిరిగ ఇంద్రియములను యథేచ్ఛగా, ముడుచుకొనుచు, అంతర్ముఖము గావించుకొనువారికి, తృష్ణ, మోహము అనువానియందు, నిస్సారము (అయిష్టత) ఏర్పడును. అతడే 'స్థితప్రజ్ఞుడు' (నిశ్చలమైన భావముగలవాడు) అనబడును.

## ఇంద్రియ నిగ్రహము చేయుట యెట్లు ?

ఇంద్రియ నిగ్రహము చేయవలెనన్న; మొదట, తామస ఆహారము, (మద్యమాంసములు) భుజించకూడదు, చెడుసహవాసమువిడువవలెను. మరియు పరనిందచేయుట, పరస్త్రీలను గురించి యాలోచించుట, కామోత్తేజకములగు దృశ్యములు (సినిమాలు) చూచుట మొదలగు దురభ్యాసములను సాధ్యమైనంతవరకు వదలవలెను. తరువాత సాత్వికమైన వాతావరణములో నివసించుచు (సాత్వికమైన) శాకాహారులగుట, సద్గుణములుగల మిత్రులతో, నీతిదాయకమైన చర్చలు జేయుట, సచ్చరిత్రములు వినుట. సద్గ్రంథములు చదువుట, భగవంతుని యారాధించుట, స్మరించుట మొదలగు సత్కార్యములను అలవరచుకొనుటకు ప్రయత్నించవలెను. క్రమక్రమముగా తమో

గుణములు విడిపోవుచు, సత్వగుణములకు స్థానములభించి, మనలో ఇంద్రియ చంచలత్వము సన్నగిల్లును. ఇంద్రియ సుఖములతో పాటు కల్గు ఆయాసము, మాలిన్యపరిస్థితి తెలిసి, నిస్సారమనిపించును ఆసక్తి తగ్గిపోవును. ఇంద్రియములు అధీనములగును.

ఇట్లు స్థైర్యముతో ఇంద్రియములను జయించువాడు, ఎట్టి ఘనకార్యమునైనను చేయగల్గును. ఆత్మశక్తి (భగవంతుని) యందు విశ్వాసము గలవాడై, సంకుచిత భావముతో నుండక, చపలత్వము నొందకుండును. క్షణికమైన, మాలిన్యయుక్తములైన భోగములను కోరక, నిండుబిందెవలె తొణకని మనఃప్రవృత్తిగలవాడగును. కావున మనముజాగ్రత్త వహించవలెను. పరులను, పరద్రవ్యములను, పరస్త్రీలను వశపరచుకొనగూడదు. "అంతరింద్రియములను" వశపరచుకొనవలెను. నియమబంధములో నుంచవలెను. లేనిచో "బుద్ధి" యను ధనమును, కామ, క్రోధ, లోభ, మోహములనబడు చోరులు లోన ఆవరించి యపహరింతురు. కావున, ధనాగారమునకు రక్షకునివలె "బుద్ధి" యను ధనమును మనము కాపాడుకొనవలెను. జితేంద్రియులము కావలెను. జితేంద్రియత్వమెట్టిదనిన :—

శ్లో॥ శృత్వాస్పృష్ట్వాచ దృష్ట్వాచ భుక్త్వాఘ్రాత్వాచయోనరః।
నహృష్యతిగ్లాయతివా, నవిజ్ఞేయో జితేంద్రియః ॥
[ మను— 2-98 ]

<u>భావము</u> — నిందాస్తుతులను విన్నను, మృదు - కఠినశయ్యలందు పడుకొన్నను, సుందర—భీకర దృశ్యములు జూచినను, సాధారణ— భోగ్య ఆహారములు భుజింపవలసి వచ్చినను,

దుర్గంధ–సుగంధములవల్లను, ఎవడైతే చలించడో, (సుఖము నందు గర్వించడో, కష్టమునందు దుఃఖించడో) అట్టివాడే, జితేంద్రియుడనబడును.

కావున ఆరోగ్యము, బలము, ఆయుష్యము, కీర్తినిగోరు వారలైన యథాయోగ్యముగ, నింద్రియ నిగ్రహము చేయుట ముఖ్యమని గ్రహించి ప్రయత్నించవలెను.

## 6. భగవత్పూజ [యజ్ఞము] :-

జగన్నాథుని పాలనలో మనము జీవించుచున్నాము. పలువిధములైన ఫలితములను అనుభవించుచున్నాము. కావున అట్టి భగవంతుని యారాధించుట మన కర్తవ్యము. భగవంతుడు అనంత నామములు– రూపములుగలవాడు. ఎవరెట్టి నామమును స్మరించినను, ఏ(విగ్రహ) స్వరూపమును పూజించినను సర్వాంతర్యామియగు ఒకేనొక భగవంతునకు జెల్లును. పూజించుటయనగా అతనిని సంతసింపజేయుట. భగవంతుని సంతసింపజేయుటకు, చేయు (పూజలు) కర్మలు వివిధములు గానుండును. 1. అగ్నిహోత్రాది యజ్ఞయాగములు చేయుట. 2. మూర్తిని గంధ, పుష్ప, తులసీదళముల చేత నలంకరించుట. 3. నామస్మరణ చేయుట. 4. భాగవతోత్తములను సత్కరించుట, మరియు నిరుపేదలగు దరిద్రనారాయణుల సేవజేయుట మొదలగునవి యన్నియు "భగవత్పూజ" లే యగును.

యజ్ఞ యాగములు మహత్తర కార్యములు. పూర్వకాలములో మహర్షులు, మహారాజులు చేయువారు. ఇప్పటికిని ఏకొందరైనను శాస్త్రవిహితముగ లోకకల్యాణముకొఱకు (కాలపరిస్థితిననుసరించి) చేయుచు పవిత్రులగుచున్నారు. కాని

సామాన్యులమగు మనకందఱకు, ఇట్టి మహాత్కార్యములు జేయుటకు శక్తి లేదు. అయినను సాధారణముగా నందఱు, విగ్రహారాధన జేయవచ్చును. దీనికి ఎట్టి సామర్థ్యములు అవసరము లేకుండ న్యాయాపరహితముగ జేయగల్గుదుము.

భగవంతుని విగ్రహములు: దేవాలయములలో (పుణ్యస్థలములలో) గృహములలోకూడ పూజింపబడుచుండును. ఎట్టి పరిదేశమునందైనను మన మనస్సు; మనముందు భగవంతుని దివ్యమంగళ విగ్రహముండుటవల్ల, దర్శించినంతనే ఆకర్షింపబడి తొందరగ ధ్యాననిమగ్నత చెందగలము. పవిత్రులము గాగల్గుదుము. మనుష్యుడు అప్పటివరకు ఎట్టి స్వభావముగలవాడైనను, ఎట్టి యాచరణగలవాడైనను దేవాలయ ఆవరణములో నడుగుబెట్టి ప్రదక్షిణము జేయునంతలోనే అతని [కొన్ని] కల్మషభావములు విడిపోవును. ఇక భగవంతుని దివ్యమంగళ [విగ్రహమును] స్వరూపమును సందర్శించినంతలోనే, సాత్విక భావముగా మార్పుజెందును. నమ్రుడై వ్యవహరించును; చూడుడు! భగవద్దర్శనమువల్లనే ఎట్టి మార్పు కలుగుచున్నది! ఇక పూజించుటవల్ల మనమెట్టి ఉన్నతదశనైనా పొందగల్గుదుము. ఇట్టి మానసిక సంతృప్తిని, భగవంతుని స్వరూపమును మనస్ఫూర్తిగ, ఒకసారైన సందర్శించినవారు, పూజించినవారెరుంగక యుండరు.

అందులకే మన హిందూసాంప్రదాయమువారు అన్నిటిలో విగ్రహారాధనకే విశేషముగ ప్రాముఖ్యము నొసంగియున్నారు. ఇప్పటికి ఆచరించుచున్నారు. ఇట్టి భగవదారాధనను క్రమముగా, శాస్త్రోక్తముగ [స్నాన] అభిషేకాదులు చేయుచు గంధ, పుష్ప, తులసీదళవస్త్రాభరణాదులతో నర్చిం

చుచు నాచరించవలెను. ఇట్లు చేయుటవల్ల మనుష్యుడు పాపములనుండి విముక్తుడై, సత్వగుణోపేతుడై, ఉత్తమపదము నందుట కర్హుడగును.

విగ్రహారాధనకు తగిన అవకాశము ప్రతి వ్యక్తికి లేకపోవచ్చును, అయిన నేమి? ఎవరెట్టి పరిస్థితిలోనున్నను, ఏపని చేయుచున్నను, [ఏకాంతముగ లేక] అంతస్సులో భగవన్నామ స్మరణ చేయవలెను. కలియుగమైన ఈ రోజులలో "స్మరణాన్ముక్తిః" అని యన్నారు మన పూర్వులు. కావున భగవన్నామ స్మరణ [మానసిక పూజ] చాల ఉత్తమమైనదని గ్రహించవలెను.

మరియు భగవదంశచే జన్మించినట్టి భగవద్భక్తులను, భాగవతోత్తములను మనకున్న సంపదతో సేవజేయుచు సత్కరించవలెను. ఇట్లు చేయుటచే వారు సంతృప్తినొందుదురు. భక్తులు భగవంతునకుప్రియులు. అట్టి భక్తులను సత్కరించి, సంతుష్టినొందించినచో భగవంతుడు సంతసించును. కావున ఇట్టి సుగమ పద్ధతినికూడ అవలంబింపవచ్చును.

ఇంతేగాక మనముజేయు సర్వకార్యములు, భగవత్కార్యములు (పూజలు) గా చేయవచ్చును. ఉదా:— ఉపాధ్యాయుడు విద్యార్థికి విద్యనేర్పుట, వైద్యుడు (అత్యాశలేక) వ్యాధిగ్రస్తునకు ఉపచారముజేయుట, సంపదగలవారు నిరుపేదలకు అన్నవస్త్రము లొసంగుట, భూదేవతలగు సద్బ్రాహ్మణులను సత్కరించుట, మనశ్శరీరములతో స్త్రీ; తన భర్తసేవజేయుట, పరోపకారముజేయుట, మొదలగునవి యన్నియు సద్భావముతో జేసినచో, భగవత్పూజలేయగును. అన్ని కార్య

ములు భగవత్పూజ లెట్లగునన్నచో, ఉపనిషద్వాక్యమును గమనించవలెను :—

— యచ్చకించిత్ జగత్సర్వం దృశ్యతేశ్రూయతేపివా,
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః ||

భావమేమనగా:— ఈ ప్రపంచములో, ఏవైతే కనబడుచున్నవో, వినబడుచున్నవో వెలుపల, లోపల, అన్నిదిక్కులలో పరిపూర్ణముగ శ్రీమన్నారాయణుడు వ్యాపించియున్నాడు.

శ్లో|| విష్ణోస్సకాశాదుద్భూతం జగత్తత్రైవచస్థితం |
భూతగ్రామమిమంకృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ||
(విష్ణు - 1-31)

ఈ ప్రపంచమంతయు విష్ణుభగవానునిచే నుత్పన్నమైనది, మరియు వ్యాపించియున్నది. ఆయన ఈజగత్తునకు సృష్టి, స్థితి, లయకారకుడు. ఈ ప్రపంచమంతయు ఆయన (వశమై) స్వరూపమైయున్నది.

కావున సద్భావముతో సర్వప్రాణులయందు ప్రేమభావమునుంచి, మనము సత్యభాషణము, పరోపకారము, ఇతరుల దుఃఖమును బోగొట్టుట, తల్లిదండ్రిల సేవ, మొదలగునవి యన్నియు (భగవత్కార్యములుగా) జేయవచ్చును. ఎట్టి పవిత్రకార్యములచేతనైనను, మనము భగవద్భక్తులమగుటకు ప్రయత్నించవలెను. అపుడే పవిత్రులమగుదుము. లేనిచో పశుతుల్యులమే !

సీ|| కంజాక్షునకుగాని కాయంబుకాయమే,
పవన గుంభిత చర్మభస్త్రిగాక,
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే,
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక,

హరిపూజనము లేని హస్తంబు హస్తమే,
తరుశాఖనిర్మిత దర్విగాక,
కమలేశుజూడని కన్నులు కన్నులే,
తనుకుడ్యజాల రంధ్రములుగాక.
గీ|| చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబుగాక
"విష్ణుభక్తి" లేని విబుధుండు విబుధుడే,
పాదయుగము తోడి పశువుగాక. (భాగ-7-170)

అను ప్రహ్లాదసూక్తిని మనము గమనించి నడుచుకొన ప్రయత్నించవలెను.

## 7: స్వాధ్యాయము :-

మానవత్వమును సంపాదించుటకు మనము స్వాధ్యాయము జేయుచుండవలెను. వేదములు, భాగవత, రామాయణాది భగవత్కథలు, నీతియుక్తమైన చరిత్రములు అధ్యయనము చేయుటవల్ల, మననము చేయుటవల్ల మనోవికారములు తొలగిపోయి, ఉత్తమ విచారములు గల్గును. విచారములు సంస్కరింపబడి, సదాచారుల మగుదుము. విజ్ఞానముకూడ వికసించి పాండిత్యము గల్గును.

వేదాది అధ్యయనములలో ఉత్తమమైనది, భగవన్నామ (కీర్తనలు) స్తోత్రము. భగవంతుని కల్యాణ గుణములను స్తోత్రము చేయుటవల్ల, మనలోనున్న దుస్స్వభావములు విడిపోయి, శాంతము, సద్గుణములు తొందరగ ప్రకాశ మొందును. ఆత్మశక్తి యుగల్గును. ఇట్టి ఆచరణమునకుముఖ్యముగా సత్పురుషుల సహవాసము, చదువు, కావలసియుండును. విజ్ఞానుల

సహవాసమువల్ల శ్రద్ధ, భక్తి, విశ్వాసములుగల్గును. దైవీ గుణములను వృద్ధినొందించు ఆసక్తితో ధర్మశాస్త్రములు, పుణ్యకథలు వినుచు, చదువుచుండవలెను. ఇట్లు మననముచేయుట, ఆచరించుటవల్ల సద్గుణములుగల్గి, పవిత్రులమగుదుము. పరమ భాగవతోత్తములైన యామునాచార్యులు, కులశేఖర మహారాజు; పరమ భక్తులైన రామదాసు, మీరాబాయి, మొదలగువారు భగవంతుని ప్రేమపూరితముగ, స్తోత్రముచేసి (తమ శరీరమును మరచినవారగుచు) పరమాత్మని కృపకు పాత్రులైరి.

భగవన్నామస్మరణము జీవునకు– పరమాత్మునకు మిత్రుత్వము కలిగించు ఉత్తమసాధనము; వేఱొకటి దీనిని మించినది లేదు. కాని ఈరోజులలో కొందరు–చేయు స్వాధ్యాయములు విపరీతములుగ నున్నవి. అవి; నవలలు, కామోత్తేజకమైన కథలు, కల్పితగాథలు మొదలైనవి. వీని అధ్యయనమువల్ల, మనుష్యుడు సహజమైన శాంతమును, సాత్త్విక బుద్ధిని గోల్పోవుటయేగాక చంచల మనస్కుడై (ఇంద్రియలోలుడై) భ్రమపూరితమైన ఆసక్తితో చెడుప్రవర్తనలకుకూడ దారితీయును. సమాజములో అపకీర్తినొందును.

ఎట్లనిన; సభ్యతాదూరములైనవి, ధర్మవిరుద్ధములైనవి, భ్రమపూరితములైనవి (అసత్యములైనవి) చదువుటవల్ల విజ్ఞానమెట్లుగల్గును! అసత్యమైనదే– అంధకారము (అజ్ఞానము) భ్రమయే బుద్ధిహీనతకు హేతువుగదా! ఇక వానికి మూలమైన పుస్తకములను (విషయములను) అధ్యయనము చేయుటవల్ల, సత్యద్యోతకమైన విజ్ఞానమెట్లు పొందగలము! (పొందనేరము).

కావున యథార్థమును గ్రహించి అట్టి కల్పిత గాథలను చదువుట, ఊహాగానములను జేయుట, సాధ్యమైనంతవఱకు వదలవలెను. వీనికి దూరమున్నవానిలోనే, మానవత్వమునకు స్థానమున్నది. ఇక వివేకముగలవారమై, ధర్మవిహితములైనవి, నీతినిబోధించునవి, భగవద్గుణములను వర్ణించునవి, సత్పురుషుల ఆదర్శములను చాటునవి, జదువుటకు ప్రయత్నించవలెను. మరియు వీలుననుసరించి ప్రతిదినము, పుణ్యాదాయకమైన స్తోత్రములు, పురాణములుకూడ మన నిత్యజీవితములో పఠనము జేయుటకు ప్రయత్నించుట, అనునవి పరమావశ్యకములు.

## 8. తపస్సు (స్వధర్మ పాలనము) :-

మనలో మానవత్వము వికసింపవలెనన్నచో, అధికారము ననుసరించి తపస్సు [స్వధర్మపాలనము] జేయుట ముఖ్యము. శాస్త్రవిహిత కర్మలను, కష్టమునకోర్చి, నిశ్చల చిత్తముతో జేయుటయే "తపస్సు" యనబడును.

స్వధర్మపాలనమువల్ల, మనుష్యుడు తేజోవంతుడై ఉత్తమ చరిత్రుడగును, పవిత్రుడగును. కావున స్వధర్మపాలనము జేయుటలో, ఎన్ని ఇబ్బందులు, ఆటంకములు వచ్చినను, కార్యశీలుడై వంశగౌరవమును నిలబెట్టవలెను. అట్టివాడే తన మానవజన్మను సార్థకము గావించుకొనగల్గును.

స్వధర్మములు ఉదాహరణముగ నిట్లుండును :—

బ్రాహ్మణుడు :— ఉదయమున స్నానముజేయుట, సంధ్యానుష్ఠానమును జేసికొనుట, వేదాధ్యయనము జేయుట, భగవదారాధన జేయుట, లోకకల్యాణ వాంఛాయుతుడై, సత్కర్మ

లను జేయుట, ఇతరులచేత జేయించుట మొదలగునవియగును. క్షత్రియుడు:— నిత్యకర్మలు నిర్వర్తించుకొనుట, ధర్మపరిపాలన జేయుట, ధర్మమును రక్షించుట, భగవత్కార్యములు జేయుట. వైశ్యుడు:— సదాచారము కల్గియుండుట, ధర్మవ్యాపారము జేయుట, గో-ధనమును రక్షించుట, సాధుపోషణ జేయుట, భగవత్కార్యములకు సహకరించుట. శూద్రులు:— సద్భావముగలవాడగుట, సత్కర్మలు జేయుట, సాధుసేవలు జేయుట, భగవంతుని పూజించుట మొదలగునవి యగును.

ఇట్లు ఏ వర్గమునకు జెందినవారైనను, తమతమ ధర్మలను దీక్షతో ఆచరించుటవల్ల సమానమైన ఫలితము నే పొందగల్గుదురు. పవిత్రులగుదురు. ఇప్పటి దేశ, కాల, పరిస్థితులలో, జాతి, మత, భేదరహితమైన సమాజవ్యవస్థ ఏర్పడుచున్నది. సర్వధర్మ సమానత్వమునకే ప్రాముఖ్యము నొసంగుచున్నారు. ఇందులోనున్న ఉద్దేశ్యమును [ ధ్వనిని ] మనము మాత్రము పరిశీలించవలయును. సమాజములో ఐక్యము కొఱకే, ఇట్టి ఉద్దేశ్యము అనువర్తించును. ఐక్యభావమును వృద్ధి జేయుటయే, కొందరి పెద్దల యభిప్రాయము. అందుకే ఇట్టి సర్వధర్మ సమానత్వమును గురించి, ప్రచారములు, ఆచారములు చేయుచున్నారు.

ఈ పరిస్థితిని కొందరు సనాతనాచారములు గలవారు; దూరుచున్నారు. కాని ఇచ్చట గమనించవలసిన దేమనిన, ఇప్పటి సమాన ధార్మికవాదములు సార్వజనీనమైనవి. బాహ్యవ్యవహారమునకుమాత్రమే సంబంధించినవి. వ్యక్తిస్వాతంత్ర్యమునకు మాత్రము అడ్డువచ్చుటకు కాదు. అంతరుద్దేశ్యము ఇదియేకాని, విపరీతార్థములవల్ల, మనలో కొందఱు ధర్మవిరు

ద్ధముగా నడచుటకు, నడిపించుటకు ప్రయత్నించుచున్నారు. వ్యక్తిస్వాతంత్ర్యము ననుసరించి, స్వధర్మపాలన జేయుటలో ఎట్టి ఆటంకములుండవు. ఎవరివారి గృహములందు, యథేచ్ఛగా స్వధర్మ నిష్ఠాగరిష్ఠులై యుండవచ్చును. ఈవిషయమును గ్రహించినచో సనాతనోద్దేశ్యముగలవారికి, ఇప్పటి సమాజ వ్యవస్థను దూరవలసిన పనికూడ లేకపోవచ్చును.

కాని ముఖ్యముగా మనము గమనించవలసిన దేమనిన; భగవంతుడు సర్వమానవ కల్యాణము గురించియే వర్ణవ్యవస్థను, ఏర్పరచియున్నాడు. తదితరులు, ఊహాకల్పితమన్నట్లు, ఏర్పడినదికాదు. మనుష్యులగుణ, కర్మల ననుసరించియే, నిర్ణయింపబడినది. అది భగవన్నిర్ణయము. కావున, అట్టి మూలాధారమును, మనము విడువరాదు యథాయోగ్యముగ విశ్వసించి, నడచుకొన్న నే, ఏదోఒకస్థితిని పొందగల్గుదుము. లేనిచో ఎందునననంటక, నరకము ననుభవింపవలసి వచ్చును. కావున ధర్మవిహితమైన స్వధర్మపాలనము చేయుటయే మనకు యోగ్యము.

శ్లో॥ శ్రుతి, స్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హిమానవః।
ఇహకీర్తి మవాప్నోతి ప్రేత్యచాను త్తమం సుఖం॥
(మను—2–9)

—మానవుడు వేదములందును, ధర్మశాస్త్రములందును జెప్పబడిన స్వధర్మమును పాలించుటవల్ల ప్రపంచమునందు సుఖము, కీర్తినొంది, తర్వాత మోక్షమునుగూడ బొందగల్గును.

అనియుండుటవల్ల మనము స్వధర్మానువర్తనులమై, మెలగుచు ఆత్మశక్తిని సంపాదించవలెను. హరిశ్చంద్రుడు, ధర్మజుడు మొదలగు మహాపురుషులు అట్టి ఆత్మశక్తి చేతనే

ఎన్నోకష్టములను ఎదుర్కొనగల్గిరి. వారి "ధర్మ" మే వారిని రక్షించినది. కావున నట్టి యాదర్శముల నవలోకించి, నడచుకొనవలెను. ధర్మమునందే విశ్వాసముగలవాడు మొదట కష్టములనొందుచున్నట్లు కనబడినను, అంతస్సులో ధైర్యమును మాత్రము వదలకుండ, ముఖములో విషాదరేఖలు కనిపింపక "పరమశాంతి" ననుభవించును.

మన భరత ఖండములో పూర్వము, ఎందఱో ఋష్యాదులు ధృఢనిశ్చయులై (స్వధర్మాచరణాత్మకమైన" తపస్సును జేసి దివ్యమైన శక్తిని గడించినవారై, లోకకల్యాణార్థము, ఉత్కృష్ట కార్యములెన్నియో జేసియున్నారు. అట్టివారి విషయములు తెలియనివారుండరు. ఇకవారి యాదర్శములననుసరించి, మనకు సాధ్యమైనంతవఱకు నడచుటకు ప్రయత్నించినచో, స్వధర్మ నిష్ఠగలవారమగుదుము. ఏకాగ్రబుద్ధి, మరియు ఆత్మశక్తియు, వృద్ధిబొందును. పవిత్రులమగుదుము. కావున మనము "స్వధర్మాచరణమునకు" ప్రయత్నించుట ముఖ్యమని గ్రహించవలెను.

## 9. భావ సరళత్వము (ఆర్జవము):-

మనుష్యుడెట్టి భావముగలవాడగునో, అట్టియాచరణ గలవాడగు. కావున కపటము, ద్వేషము, కఠోరత యనుభావములను విడువవలెను. సరళమైన అంతర్భావమును మనము ఆర్జించవలెను.

కఠోరస్వభావము, కపటభావము, అసూయాభావములు గల మనుజుడు తమోగుణప్రధానుడై పరహితమును గోరక ఇతరులకు ద్రోహముచేయుచు, సత్పురుషులను అవమానిం

చుచు, సత్కార్యములను జెడగొట్టుచుండును. ఇతరులు దుఃఖింపగా జూచి సంతసించును. అట్టివాని దుస్స్వభావము, మొదట తెలియకున్నను, కొంతకాలముతర్వాతనైనా తెలిసికొని, లోకులు దుష్టుడని దూరుచుందురు. ఇతరుల హృదయములో అట్టివ్యక్తికి స్థానముండదు. ఆపత్కాలమునందుకూడ వానిదగ్గరకు నెవరుజేరరు. వ్యాధితో మంచము పట్టినను గుక్కెడు మంచినీరు పోయువారుండరు. ఇక వాని జన్మమెందులకు? చివరకు నీచములైన అవస్థలనంది మరణించును. ఇట్టి దృశ్యములను, వ్యక్తులను మనము అచ్చటచ్చట చూచుచునే యున్నాము,

సరళస్వభావముగలవాని హృదయము- (అంతర్భావము) పైకి ఆచరణయు ఒకేతీరుగ నుండును, శాంతరస ప్రాధాన్యముగల చూపులు, ప్రియవచనములు గల్గియుండును. మరియు మృదుభాషణముచేయుచు, పరుల శ్రేయస్సునుగోరుచు (పరోపకారమునుజేయుచు) సత్పురుషులను గౌరవించుచు, సత్కార్యములందు సహకరించుచుండును. దీనులైనవారి దుఃఖమును బోగొట్టుటకు ప్రయత్నించును. అట్టివాడు సమాజములో నితరుల సుఖమే, తన సుఖమని భావించి, అందరి ప్రేమకు పాత్రుడగును. కీర్తివంతుడగును.

అంతస్సులోనున్న కపటము, అసూయ మొదలగు దూషితభావములే మనుష్యుని జెఱచునవి. వానివల్లనే మనము తృష్ణాపూరితులమై దుఃఖము (అసంతృప్తి) నొందుచున్నాము. కావున ఉత్తమస్వభావము నార్జించుటకు అంతస్సును నిర్మలముగా, సరళముగా జేయుట ముఖ్యము. అందుకు పెద్దవారితోగాని, పిల్లలతోగాని, మిత్రులతోగాని స్త్రీ; తన భర్తతో

గాని, అత్త మామలతోగాని, అంతస్సులో నొక భావముంచు కొని పైకి ముఖప్రీతి వాక్యములు బలుకక యథార్థమైన, న్యాయయుక్తమైన వచనములు బలుకుచుండుటకు ప్రయత్నించుచుండవలెను.

ఇట్లు ఇతరుల మనస్సు నొప్పింపకుండ ప్రయత్నించువారు కొద్దిరోజులలోనే సత్స్వభావము గలవారగుదురు. అందుకొఱకు మనమెట్టి కార్యములు జేసినను, ఏవిషయములు జెప్పినను, యథార్థమును, సరళత్వమును పోషించుకొనుచు వ్యవహరించవలెను. అపుడే మనము కుటుంబములో, సమాజములో నందఱకు విశ్వసనీయులమగుదుము. ఇట్లు ఇంతవరకు కొందఱు సత్పురుషులు ప్రవర్తించి, ప్రపంచఖ్యాతి నొందియున్నారు. ఈరోజులలోకూడ కొందఱు మహాపురుషులను, విశ్వప్రేమ (గౌరవము) గలవారినిగా మనము జూచుచునేయున్నాము. ఇందులకు వారిలోనున్న భావసరళత్వమే కారణము.

మరియు ప్రతి మనుజునిలోనున్న "అంతరాత్మ" స్వచ్ఛమైనది. ఎల్లప్పుడు సద్భావమునే గల్గియుండుట, యాత్మగుణమైయున్నది. అది అప్పుడప్పుడు హెచ్చరించుచునే యుండును. ఉత్తమ పదమును బొందుటకు పరితపించునుకూడా!... కాని అజ్ఞానముచే మనుష్యుడు దానిని గుర్తించకుండును. మనము జ్ఞాపకముంచుకొనవలెను! ఎవని హృదయము స్వచ్ఛమైనదో వాని హృదయములోనే భగవంతుడుండును. అట్టివాడే నిజమైన మనుష్యుడనబడును.

## 10. అహింస :-

మానవత్వపుష్టిని గోరునపుడు మనము ఇతర ప్రాణు

లను హింసించుట వదలవలెను. "హింస" యనునది మను ష్యుని రాక్షసునిగా జేయును. నరకము నొందించును. అహిం సాధర్మము నవలంబించుటవల్ల, పురుషుడు "మహాపురుషు" డగును.

మన ధర్మశాస్త్రములలో మూడువిధములైన హింసల నుండి విముక్తుడు కావలయునని చెప్పబడియున్నది. అవి:— 1. శారీరక హింస, 2. వాచా (మాటలచే) హింస, 3. మాన సిక హింస, అని మూడు విధములు శారీరకహింసయనగా:— (శరీరముతో) ఇతర ప్రాణులను కొట్టుట, గోవులు, మేకలు, గొఱ్ఱెలు, మొదలగు పశువులను,— పావురములు, కోళ్ళు మొ దలగు పక్షులను చంపుట యను ఘోరమైనవి. ఇట్టి హింసలు మాంసభక్షణ నిమిత్తమై చేయబడుచున్నవి. నేటి "సమా జము" శాస్త్రవిహిత మర్యాదల నుల్లంఘించి, మాంసభక్షణ చేయుచున్నది. ఎన్నో ప్రాణములను తీయుచున్నారు! ఎంత పాపకార్యమున కొడిగట్టినారు!! మనుష్యుని రక్షణలో (పెంచ బడి) సహజమైన విశ్వాసముతోనున్న ప్రాణులకు ద్రోహము జేయవచ్చునా ?

శ్లో|| యావంతి పశురోమాణి తావత్కృత్వోహమారణమ్,
వృథాపశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్యజన్మని జన్మని||
( మను— 5—38 )

భావమేమన:— యజ్ఞాదులందుగాక వ్యర్థముగా (మాంసభక్షణ నిమిత్తము) పశువులను జంపువాడు, తాను జంపిన పశువున కెన్ని రోమములుండునో యన్నిజన్మలు (పశువుగా) జన్మించి, ఇతరులచే హింసింపబడుచుండును.

కొన్ని ధర్మశాస్త్రములందు, జీవహింస: యజ్ఞార్థము.

శ్రాద్ధకర్మలయందును, ఎట్టి యాహారము లభింపని సమయ మునందును జేయవచ్చునని; కొందఱు ఇట్టి స్థితిలోనే జేసినట్లు ను జెప్పబడియున్నది. మరియు మనుష్యేతర ప్రాణులు ఒక దానికొకటి ఆహారముగా నుండునట్లు భగవంతుని సృష్టిలో గానవచ్చును. కొన్ని పరిస్థితులందు క్షత్రియుడు – సస్యరక్షణార్థము వేటాడుట, అధిక పుష్టిని సంపాదించుటకు మాంసభక్షణమును చేయఁవచ్చునని జెప్పబడియున్నది. దీనివల్ల తెల్యునదేమనని స్వార్థబుద్ధితో గాక, పరహిత కార్యము లత్యావసరమైననే తప్ప, ధర్మవిరుద్ధముగా జేయకూడదు. అని స్పష్టమగుచున్నది.

కాని ఈరోజులలో చాలామంది విపరీతార్థములు జేసికొని పశువులన్నియు మనుష్యులకొరకే (మాంసభక్షణ నిమిత్తము) సృష్టింపబడినవనియు, శ్రాద్ధాదులందేగాక ప్రతిరోజు మాంసభక్షణము జేయవలయుననియు, తలంచి స్వార్థపరులై 'జీవహింస' ను జేయుచున్నారు.

కొందరు ఇట్టి ధర్మాదులు తెలిసికూడా, కలియుగమైన ఈరోజులలో మనుష్యమాత్రులమగు మనకు; పూర్వయుగములో కొందఱు ఋష్యాదులు, మహానీయులు, మాంసభక్షణము జేసియున్నారనియు; ఏదో విశేష పరిస్థితికి గురియైనవారిని, సామాన్యమైన ఆధారముగా జేసికొని సాధించుట, వెఱ్ఱితనమనిపించును. ఎట్లనిన; అప్పటివారు ఏదో ప్రతిబంధక వాతావరణమువల్ల పొరపాటుజేసినను, తిరిగి పవిత్రతనొందు శక్తి, సామర్థ్యములు గలిగియుండిరి. తపఃకర్మాదులచే పునః సృష్టినిగూడ జేయగల్గువారి యాదర్శము లెక్కడ! ఒకరోజు భోజనము లేకున్న మరణావస్థనొందు మనమెక్కడ!! ఇట్టి ప్రాశ

స్త్వముసు గమనించినచో మనకు, వారికినిగల అంతరము తెలియును.

మరియు కొందరు ఉత్తమవర్ణస్థులుకూడ, ఇట్టి మాంస భక్షణము కేవలము శ్రాద్ధాదులందేగాక, వ్యర్థముగ జేయుట; నరకమనిగూడ స్పష్టముగ దెలిసి 'గొఱ్ఱెదాటుడు' పద్ధతి నవలంబించినట్లు గానవచ్చును. ఇందులో వారి యభిప్రాయము- "మేము స్వహస్తములతో జీవహింస చేయకూడదు, ఇతరులు చేసినచో, లేక భగవదర్పణము గావించినచో, ఇక దోషము లేదని" తలంతురుకాబోలు!!... కాని భగవంతుడు, సాత్విక పదార్థములన్నియుండగా హింసాత్మకమైన తామసపదార్థముల నెట్లుకోరును? ఇది జిహ్వాచాపల్యమను దోషమనుటలో సందియము లేదు.

శ్లో॥ అనుమంతా విశసితా నిహంతాక్రయవిక్రయీ
సంస్కర్తాచోప హర్తాచ, ఖాదకశ్చేతి ఘాతుకాః ॥
(మను- 5-51)

— జీవహింసకు సమ్మతించువాడు, జీవముల యంగములను ఛేదించువాడు, జీవములను జంపువాడు, వాని మాంసమును గొనువాడు, దానిని విక్రయించువాడు, వంటజేయువాడు, వడ్డించువాడు, భక్షించువాడు, వీరందరును ఘాతుకులు యనబడుదురు. (నరకము ననుభవింతురు) అని భావము.

ఇట్లు మానవ ధర్మశాస్త్రములందు జెప్పబడి యున్నందున, స్వార్థబుద్ధికి మూలమైన జీవహింసను జేయుట, సాధ్యమైనంతవరకు విడుచుట మన కర్తవ్యము.

శ్లో॥ నభక్షయతియోమాంసం విధింహిత్వా పిశాచవత్

సలోకే ప్రియతాంయాతి వ్యాధిభిశ్చన పీడ్యతే ॥
( మను— 5—50 )

— ఎవడైతే పిశాచమువలె తినక, మాంసభక్షణము విడుచునో అతడు అన్ని ప్రాణులకు మిత్రుడై ఆరోగ్యవంతుడుగ నుండును. అని యుండుటచే (శాస్త్రవిహితములైన అత్యావసరములందుతప్ప) జీవహింసను, ప్రయత్నముతో వదలి మనము శారీరక హింసలకు లోనుగాకుండుట, పరమావశ్యకము.

శరీరముతో హింసించుటయేగాక వాక్కుచేత:— కఠినముగ మాటలాడుట, అమంగళములైన వాక్యములు బలుకుట, దూషించుట, ఇతరుల మనస్సు నొప్పించుట, మరియు స్త్రీలను, తల్లిదండ్రులను, సాధుపురుషులను గురించి కఠినోక్తులు బలుకుట, స్త్రీ: తన భర్తను, అత్తమామలను అసభ్యతగల మాటలచేత నవమానించుట, మొదలగునవన్నియు వాచాహింసలగును. కావున వీనిని ప్రయత్నముతో విడువవలెను.

మనస్సుచే:— నితరులను దూషించుట, వారి నాశమును, దుఃఖమును కోరుట, పరస్త్రీల విషయమై తలంచుచుండుట, సత్పురుషులను గురించి దురాలోచనలు చేయుట, మొదలగునవి మానసికహింస లనబడును.

'అహింసా పరమోధర్మః' అను న్యాయమునను సరించి పైన వివరించిన హింసలను ప్రయత్నముతో విడచి; శరీరముతో పరోపకారము జేయుట, మాటలచేత; మంగళవచనములు బలుకుట; మనస్సుచేత; సద్విచారములు, సద్భావములు గలవారమగుటకు, మరియు భూతదయతో ధర్మచింతన గలవార

మగుటకు, మనము ప్రయత్నించవలెను. అపుడే సదాచారము గలవారమగుదుము. పవిత్రులమై ఉత్తమపదము నొందుటకుకూడ అర్హులమగుదుము.

## 11. సత్య [భాషణ] ము:-

సత్యమనునది; ఉన్నట్టి, కనునట్టి, కనుచున్నట్టి విషయమును, అటులనే (హితము కల్గించునదిగా) నుండు మాట, మరియు అందులోని విషయము; ఈ రెండు సత్యమునకు జెల్లును. దీని నిర్ణయము అతి సూక్ష్మము. దైవీగుణములలో నిది ఉత్తమమైనది. దీనియందు విశ్వాసమునుంచి శ్రద్ధతో నెల్లప్పుడు సత్యభాషణము చేయుటకు మనము ప్రయత్నించవలెను. సత్యవాక్యముయొక్క మహిమవర్ణనాతీతమైనది 'సత్యము' భగవత్స్వరూపమనియు, ప్రపంచమునకు కారణమనియు, దీనియాధారముపైననే జగత్తు నిలిచియుండుననియు ఋష్యాదులు జెప్పియున్నారు. సత్యమైన వాక్కులు బలుకుటవల్ల మనుష్యుడు దివ్యమైన శక్తిగలవాడగును. మరియు యథార్థ వ్యవహారముగలవాడగుటచేత నితరులకు ద్రోహము జేయకుండును. సహజముగ కొంత పుణ్యము నార్జించినవాడగును.

ఈ రోజులలో "సత్యము" మాట్లాడినచో సుఖము లేదనియు, కార్యము సఫలము కాదనియు, కొందఱి దురభిప్రాయముగలదు. కాని ఇది యథార్థము కాదు. అసత్యముచేత: ఇతరులను మోసగించుట, కూటసాక్ష్యములను బలుకుట, కొందఱు (న్యాయవాదులు) అబద్ధమునే వాదించుట ఒప్పించుట, దాని మూలకముగ ధనము నార్జించుట మొదలగునవి జరుగుచున్నవి. అట్టివారు మొదట కీర్తివంతులై, సుఖమునను

భవించుచున్నట్లు పైకి కనబడుచున్నను, లోలోపల, తృష్ణ, అసంతృప్తి, అధికమగుచు, "అసత్యము" నే అగ్నిచేత కుములుచున్నవారై, జీవితమును గడపుదురు. అదికూడ ఒక జీవితమేనా! కొంతవరకు దారిద్ర్యములో నున్నను, మనకు "సంతృప్తి" యవసరముకదా!

కొందఱు కూటసాక్ష్యములతో, కుకర్మలతో, జీవించువారు ఎంతసంపాదించుచున్నను, దారిద్ర్యము ననుభవించుచు, యశస్సులేనివారై, వంశనాశనము నొందుచున్నట్లు మనము ప్రత్యక్షములో చూచుచున్నాము. ఇక "అసత్య" – వ్యవహారము ఎంత విజయవంతమో ఆలోచించిన తెలియును.

సత్యమును పాటించువాడు మొదట కొన్ని కష్టములకు గురియైనను, కృత్రిమమైన యాదరణను పొందనప్పటికిని, అట్టి మనుజుడు "తృష్ణ" లేనివాడై, ధైర్యముగలవాడై ఉన్నదానితో సంతృప్తినే యనుభవించుచుండును. చివరకు కీర్తివంతుడై, సర్వసంపదలనుగూడ పొందగల్గును. ఇందుల కాదర్శమైన, ధర్మస్వరూపులైన, యుధిష్ఠరుడు, హరిశ్చంద్రుడు, మొదలగువారి గాథలు వినుచున్నాము, చదువుచున్నాము. కావున మనకు "సత్యభాషణమే" యోగ్యమైనది. ఇచట మనము వేదసూక్తులను గమనించవలెను.

— "సత్యంవద!, ధర్మంచర!" || (తై – ఉపనిషత్తు)

"సత్యమునే చెప్పుము, ధర్మముగ నడవుము."

— మధుమతీః మధుమతీభిఃపృచ్యంతామ్ (యజు-1-21)

"మానవులార! మధురముగ బలుకుడు"

— జాయాపత్యే మధుమతీవాచం || (అధ-3-30-2)

"స్త్రీలు-పురుషులతో మధురముగ మాట్లాడవలెను. మరియు

"సత్యంబ్రూయాత్, ప్రియంబ్రూయాత్,
నబ్రూయాత్ సత్యమప్రియమ్"

"సత్యము మాట్లాడవలెను. ప్రియముగ మాట్లాడవలెను. కఠినముగ మాట్లాడకూడదు."

అనుటచే మనము ఎట్లు వ్యవహరించవలయునో స్పష్టమగుచున్నది. సత్యముతోపాటు మృదుభాషణముకూడ అవసరము. 'మధురభాషణము మానవునకు ఉత్తమ భూషణము'. లేనిచో :—

శ్లో॥ నగ్నోముండఃకపాలేన భిక్షార్థీ క్షుత్పిపాసితః ।
అంధశ్శత్రుకులంగచ్ఛేత్ అసాక్ష్య మనృతంవదేత్॥
(మను- 8–93)

"ఎవడైతే "అసత్యము" ను, తప్పుడు సాక్ష్యమును బల్కునో, అతడు దిగంబరుడై, సన్యాసియై, గ్రుడ్డివాడై, బిచ్చగాడై, ఆకలిదప్పులచే పరితపించుచు, శత్రుకులమునకు (నరకమునకు) బోవును" అని భావము.

కావున మనము అబద్ధముగ వ్యవహరించుటవిడచి, సర్వదా సత్యభాషణమొనర్చుటకు, ప్రయత్నించవలెను. సత్యము పలుకుటచే మన జిహ్వాయందు దివ్యమైనశక్తి నివసించును. నియమితముగ కొన్ని వత్సరములు సత్యవాక్పరిపాలన జేసినచో భగవద్దర్శనముగూడ సులభమగును. ఏదికోరిన నది సిద్ధించుననికూడ కొందరి పెద్దలయభిప్రాయము. "సత్యేనలోకాన్ జయతి" [రామా—అరణ్య] యని సత్యప్రభావముననే 'జటాయువునకు' శ్రీరాముడు పుణ్యలోకములను ప్రసాదించగలిగెను. కావున మనము జ్ఞాపకముతో, నిత్యజీవితములో 'సత్య

ముగ' వ్యవహరించుటకు ప్రయత్నించవలెను. అపుడే [యథార్థముగ] మనుష్యులమగుదుము.

## 12. క్రోధము లేకుండుట :-

'క్రోధమ'నునది మనుష్యుని బలహీనతను సూచించును. కోపముగల వ్యక్తి నిముషములో రాక్షసస్వరూపు డగును. ఆవేశములో, మంచిచెడ్డలను ఆలోచింపక, వివేకశూన్యుడై అనుచిత కార్యములనుగూడ జేయును. కావున మనము క్రోధము లేకుండ ప్రవర్తించుటయే ఉచితము.

క్రోధమువల్ల మానసికావేదన ఉత్పన్నమగును. దానివల్ల సౌందర్యవంతుని ముఖముగూడ వికృతమై, భయంకరమై తాను తపించుచు, ఇతరులను పరితపింపజేయును. క్రోధస్వభావము సత్పురుషుని లక్షణమే కాదు. దానివల్ల మనుష్యుని శరీరము, ఆరోగ్యముపై కూడ భారము పడి, ఎప్పటికిని ఏదో వ్యాధి యున్నట్లు, లేక వేరొకవిధముగా [మానసిక] బలహీనత నొందును. ఇట్టి స్వభావమువల్లనే గదా! అత్యాచారములు, హత్యలు జరుగుట మనము జూచుచున్నాము. అట్టి యశోవిహీనమైన, మనోవికారమును, సప్రయత్నముగ విడువవలెను.

శ్లో। త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథాలోభ స్తస్మాదేతత్త్రయంత్యజేత్ ॥
[ గీత– 16–21 ]

మానవుని [ఆత్మను] నశింపజేయునవి, నరకమునకు దారి తీయునవి యగు మూడు ద్వారములుకలవు. అవి:– 1. కామము, 2. క్రోధము, 3. లోభము. కావున నీ మూడింటిని విడువవలెను.

మరియు—

శ్లో॥ క్రోధోహి శత్రుః ప్రథమోనరాణాం,
దేహస్థితో దేహవినాశనాయ
యథాస్థితః కాష్ఠగతోహివహ్నిః,
సఏవ వహ్నిర్దహతే శరీరం॥

"క్రోధము" మనుష్యులకు మొదటి శత్రువు (రెండవ శత్రువు బయటినుండి పీడించును). ఎట్లైతే కఱ్ఱలోనేయున్న అగ్ని కఱ్ఱను కాల్చుచుండునో అదేవిధముగా దేహములో నుండియే, దేహమును దహించుననిభావము." వాస్తవముగ మానవుని పతనమొందించు దుర్గుణములలో "క్రోధము" చాల ముఖ్యమైనది. ఇట్టితామసోద్రేకము (క్రోధము) ఎవరిని గురించికలుగునో వారికంటెనధికముగ నుద్రేకమునందిన వారి స్వశరీరమునకే పీడ గలిగించును. శరీరము వణకుట, నేత్రములు రక్తవర్ణముగలిగియుండుట, హృదయము జ్వలించుట, మొదలగు వికారములుగలుగును. అదియొకవిధమైన పిచ్చితనమువంటిది. దానివల్ల సద్భావములన్నియు నశించును. ఆవేశముతో మనకు భవిష్యత్తులో హానినిగల్గించే పనులను జేయించు శక్తిగలది. సత్పురుషులకు విషతుల్యమైనది. కావున మనము క్రోధమును విడచిపెట్టవలెను.

వినయ స్వభావము (చల్లదనము) తో చేయగల్గినన్ని మహత్కార్యములు క్రోధముతో చేయలేము. క్రోధముశక్తి హీనమైనది. "చల్లనిలోహము, వేడిలోహమును చీల్చును. కాని వేడిలోహము చల్లనిదానిని చీల్చజాలదు". అట్లేక్రోధము లేనివాడేఅధిక సామర్థ్యముగలిగి ఉత్తముడనబడును. వాగ్భటాచార్యుడు అన్నాడు :—

శ్లో॥ ధారయేత్తు సదావేగాః హితైషీ ప్రేత్యచేహచ,
లోభేర్ష్యా, ద్వేష, మాత్సర్య రాగాదీనాం, జితేంద్రియః॥

భావము:— ఏ మనుష్యుడైతే, ప్రపంచమునందు, పరలోకమందును, సుఖమునుగోరునో అతడు జితేంద్రియుడై, ఈర్ష్య, ద్వేషము, క్రోధము, అసూయ మొదలగు మనోవికారములను విడువవలెను.

కావున మనము "క్రోధమను" శత్రువునకు దూరముగానుండుటకు ప్రయత్నించవలెను. అపుడే సుఖముగలవారమై, పవిత్రులమగుదుము.

## 13. అహంకార (సంపద) త్యాగము:-

మనము నిత్యజీవితావసరములగు సాధారణ కర్మలు జేయుటయేగాక, కొన్ని ఉత్కృష్టమైనట్టివి, కష్టసాధ్యమైనట్టివి, కీర్తికరమైనవియగు "ఘనకార్యములు" కూడ చేయుదుము. (కొందఱు చేయలేకపోవచ్చును.) అట్టి కార్యవిజయమునకు "శక్తి" సామర్థ్యములే కారణములు.

సహజముగా ప్రతిమనుష్యునిలో "దైవశక్తి" యుండును. అది బాహ్యదృష్టికి కనిపింపకుండగనే, సత్కార్యములను నెరవేర్చుటలో సహకరించుచుండును. ఒక్కొక్కసారి ఎన్నో కఠిన పరిస్థితులున్నను, మనము సదుపాయముతో కార్యసాధన జేయగల్గుదుము. అనుకూలతలు ఏర్పడును. అట్లుచేయునదియే "దైవీశక్తి" లేక ఆత్మశక్తి. పరమాత్మయగు భగవదంశమే మన ఆత్మ. (ప్రాణము). అది దివ్యమైనది, గొప్ప శక్తి కలది గనుక గుప్తరూపముననుండి మనముజేయు కార్యములను

సఫలమొందజేయును. అట్టి కార్యవిజయమునకు కర్త ఎవరు? గుప్తరూపమైన "ఆత్మ" యే కదా! భగవదంశమైన శక్తి చేత కార్యములు జేయబడినపుడు అట్టికర్తృత్వ ఫలితము భగవంతునిదేనని మనము భావింపవలయును. అనగా:- ఈ ఘన కార్యమును "నేనే" చేసినాను (నాదేపురుషార్థము) అను "అహంభావమును" త్యజించవలెను.

మనుష్యుని శరీరము భగవంతునకొక సాధనమువంటిది. దీనిని నిమిత్తమాత్రముగ, (ఉపకరణముగ) నుపయోగించి, పనులజేయించువాడు భగవంతుడే; దాని ఫలితముగూడ భగవంతునిదేనని భావించవలెను. కాని ఇచ్చట గమనించ వలసినదేమనిన; కొందఱు ఆసక్తితో (ఆటంకము లేకుండ) జీవహింస, వ్యభిచారము, పరులకు ద్రోహము, మొదలగు చెడుకర్మలను చేయుదురుగదా! అట్టికార్యముల ఫలితమునకు కూడభగవంతుడే కర్త (బాధ్యుడు) యగునని పొరబడరాదు.. "ఆత్మ" గుణములు సహజముగనుండు; సత్యము, శాంతము, కరుణ, ఉపకారము జేయుస్వభావము మొదలగు సద్గుణములు. కావుననది ఎల్లప్పుడు; ధర్మాచరణము, దానము జేయుట, దేవాలయములు కట్టించుట, చెఱువులు వేయించుట, పాఠశాలలు గట్టించుటవంటి ఉత్కృష్టకార్యములకే; ప్రోత్సాహమొసంగును. కాని 'కుకర్మలకు'గాదు.

మనుష్యుని (శరీర) "ఇంద్రియములే" చంచలమైనవి, భ్రమపూరితములైనవి, మోహావశములైనవి. కావున చెడు కార్యములను అజ్ఞానముచేత "ఇంద్రియములే" చేయించు నని; ఆత్మ (శక్తి) కాదనియు స్పష్టముగ తెలియవలెను.

మనుజుడు ఎట్టికార్యము నుజేసినను, అహంకారము నొందక, దానిఫలితమును మనస్ఫూర్తిగ భగవంతునికొసగుచు, త్యాగము చేయవలయును ఇట్టి త్యాగమువల్ల (ఎట్టిపాపములను బొందక) భగవంతునకు కృతజ్ఞుడై, పవిత్రుడై ఆయన కృపకు పాత్రుడగును మరియు "నేను భగవంతునకు ఉపకరణమువంటివాడను, నా చేత అతడే అన్నికార్యములు చేయించుచున్నాడు. అతనివల్లనే, అన్నికార్యములు నెరవేరుచున్నవి . నేను నిమిత్తమాత్రుడను" .... అనుభావమును దాల్చుటయే మనకు శ్రేయస్కరము.

కాని ఈ రోజులలో కొందరు ఉన్నతభవన నిర్మాణములుజేయుచు, ఉన్నత అధికారమును సాధించుచు, ఉన్నత తటాక నిర్మాణములుజేయుచు, మరెట్టి సత్కార్యమును జేసినను, దీనికి నేనే కర్తను; సామర్థ్యము, ప్రతిభ నాదేనని భావింతురు. ఇట్టి అహంభావపూరితులు తాము జేసినదానిలో కొంత దైవబలమున్నదని గ్రహించరు. అట్టివారు అవిద్యామయులై, కొంతకాలము సుఖముతో వ్యవహరించినను, చివరకు పతనావస్థనొంది, మానసిక దుఃఖముల ననుభవింతురు. ఎట్లనిన:- భవనాదులు, తమయధీనమునుండి, ఎప్పటికైనను, చివరకు మరణదశయందైనను, ఇతరులకు వదలి పెట్టుట తప్పదుకదా! అట్టి పరిస్థితిలో "అహంకార-మమకారములు" బాధింపక మానవు.

కావున మనుష్యుడెట్టి ఉన్నతదశలోనున్నను, (లేకున్నను) మిడిసిపడక, అందరుకు "నేనే" ప్రభువునని భావింపక, నాకంటె గొప్పవాడు లోకాధీశుడు (భగవంతుడు) కలడని భావించి,

అహంభావత్యాగము జేయుట, ముఖ్యము.

ఇంతేగాక "కార్యసాధనకును" "ధనమునకును" సన్నిహిత సంబంధమున్నది. మనుష్యుడేమాత్రమైన ధనసంపాదన జేయును. ఆసంపదకు, వానివల్లగల్గు భోగములకు "నేనే" కర్త ననికూడ భావించును.... ఇతరులు అన్నములేక నాకటిమంటతో బాధపడుచున్నను, పిడికెడు అన్నము పెట్టుటకుగాని, ఒకనయా పైసనైన, వారికిఇవ్వనుగానిబోడు. (ఇట్టివారిని మనము అక్కడక్కడజూచుచునేయున్నాము). వీనినే "లోభి" యందురు. లోభత్వముగూడ నరకద్వారములలో నొకటియని వెనుకజెప్ప బడిన అంశములో మనము తెలిసికొన్నాముగదా! ఇక ఆకలి గొన్నవారికి అన్నము బెట్టనట్టి, వస్త్రవిహీనులకు పాతవస్త్రము నైన ఇవ్వనట్టివానికి, సంపద ఉన్ననేమి? లేకున్ననేమి! సద్వినియోగములేనిదగును.

కావున మనము ఉన్నంతలో సుఖమునుగల్గించు సంపదనుగూడ, ఇతరులకొఱకు త్యాగముచేయుటకు ప్రయత్నించవలెను. ధనము సంపాదించుట–కార్యవిజయము, ఇవిరెండు కూడ భగవదధీనములు. మనము స్వతంత్రించి చేయబూనినను, ఒక్కొక్కప్పుడు సఫలమునొందజాలము. ఆరెంటింటికిని భగవచ్ఛక్తియవసరము. కావుననట్టి (అహంకార–మమకార ములను) భావద్వయమును, భగవంతునికొఱకే త్యాగము చేయుట మనకు పరమావశ్యకమని గ్రహించవలెను. ఇచట స్వయముగ శ్రీకృష్ణభగవానుడన్న విధమును గమనింతము.

శ్లో॥ తస్మాత్త్వ ముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వాశత్రూన్ భుఙ్క్ష్వరాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ

నిమిత్త మాత్రం భవసవ్యసాచిన్||

(గీత–11–33)

"అర్జునా! నీవు యుద్ధముజేయుటకు బయలుదేరుము. నీశతృవులనందఱను (దేవతలచేతగూడ జయింపనలవిగాని భీష్మ, ద్రోణాదులను జయించి,) [వారు నీచేజయింపబడిరను కీర్తినిపొంది] సమృద్ధమైన రాజ్యమును అనుభవింపుము. వీరందరును నాచేత ముందే సంహరింపబడిరి. [అట్టిదానికి "నేనే" కర్తను], నీవు నిమిత్తమాతృడవుగమ్ము".

అనియుండుటచేత భగవంతుడు మనుష్యులను, నిమిత్త మాతృలనుగాజేసి, తానన్ని కార్యములు జేయునని స్పష్టమగుచున్నది. ఇట్టిపరిస్థితిలో నేను–నాది, యనుటకు [స్థానము] ప్రాముఖ్యము లేదుకదా! కావున మనమట్టి అహంభావమును, ప్రయత్నముతో విడువవలెను.

## 14. శాంత [ చిత్తనిగ్రహ ] ము:-

మనుష్యుని మానసిక శక్తులను వృద్ధినొందించుటలో శాంతము చాల ఉత్తమమైనది. దీనివల్ల దైవీగుణములు త్వరితగతిని మనలో వికసించగలవు. కావున మనము శాంత [చిత్త]ము గలవారము కావలెను.

"మనస్సు" సహజముగా చంచలమైనది, మానవునిచలింపజేయునది. స్థిరచిత్తములేనివాడు అప్పటికప్పుడే పలువిధములుగ మాటలాడును. అట్లు కార్యములుజేయుటకు బూనుకొనును. చివరకు దేనియందుగూడ, స్థిరత్వములేక అన్నికార్యములు మధ్యలోనే, ఆపివేయును. కార్యదక్షతలేనివాడగును.

మరియు శాంతము [ మనోనిగ్రహము ] లేనివాడుద్విగ్నుడై, మనోబలహీనుడై, మాటిమాటికి ఇతరులను దూరుచుండును. విశ్వసించకుండును. చివరకుఏపనిచేయలేక, తానుతలపెట్టినదానిని, తానేవిశ్వసించలేక [ఇతరులకు] తనకు-శత్రురూపమును దాల్చును.

శ్లో॥ బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మై వాత్మ నాజితః
అనాత్మనస్తు శత్రుత్వే, వర్తే తాత్మైవ శత్రువత్॥
(గీత-6-6)

భావము:- ఏపురుషునిచేత తనమనస్సు (స్థిరపడి) విషయములను చేరకుండునట్లు, జయింపబడినదో, వానికి ఆమనస్సే బంధువు. జయింపబడని (శాంతములేని) చిత్తముగలవానికి (నిగ్రహింపబడని) "తనమనస్సే" శత్రువువలెకీడు జేయును. మరియు "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" మనస్సే మనుష్యులను పతనమొందించునది. నరకములనుండి విముక్తినొందజేయునది యగుకారణము".

అనుటవల్ల చంచలచిత్తమువల్ల "నాశమును" స్థిరచిత్తమువల్ల పవిత్రతయు, నొందగలమని తెలియుచున్నది. కావున మనస్సును వశపరచుకొని స్థిరత్వమునొందుటయే ఉచితము.

ఈ రోజులలో కొందఱు శాంత (చిత్త) ములేనివారు, చిన్నచిన్న విషయాలకై, పరులతో దెబ్బలాడుట, మద్యపానాదులుజేయుట, వ్యభిచరించుట, జూదమునాడుట, ఆలుపిల్లలను (స్త్రీలు; భర్తను, అత్తమామలను) పీడించుట, మొదలగు దుష్కృత్యములు చేయుదురు. సంపద, ఇల్లు-ముంగిలికూడ లేనివారై పతనమొందినవారిని మనము సమాజములో నచ్చ

టచ్చట జూచుచు నేయున్నాము. ఇట్టిస్థితికి మనోనిగ్రహము, (ఉన్న దేచాలునను) సంతృప్తిలేకపోవుటయే కారణము. మనస్సును వశములోనుంచుకొన్నవాడు స్థిరబుద్ధిగలవాడై, ఎంతటి ఘనకార్యమునైనను, ప్రారంభించి పట్టుదలతో నెరవేర్చును. అట్టివాడు (మనోనిగ్రహముగలవాడై,) దుష్కర్మలకులోను గాక పవిత్రుడగును. భగవంతునకుగూడ ప్రియుడగును. ఇచట భగవద్వాక్యములను గమనించవలెను:—

శ్లో|| ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారి వ్రతేస్థితః
మనస్సంయమ్య మచ్చిత్తోయుక్త ఆసీతమత్పరః||
యుంజన్నేవ సదాత్మానంయోగీ నియతమానసః
శాంతిం నిర్వాణ పరమాం మత్సం స్థామధిగచ్ఛతి||
(గీత—6-14,15)

భావమేమనిన మిక్కిలి శాంతమైన మనస్సుగలవాడై, భయములేనివాడై, బ్రహ్మచర్యవ్రతముగలవాడై, నాయందే ఉద్దేశ్యముగలవాడై, మనస్సును ధృఢముజేసికొని యుండవలెను. మరియు నీవిధముగ శాంతచిత్తముగలవాడు నాయందు మనస్సుచేర్చి, (నాసంపర్కముచేత పవిత్రుడగును కావున) నిశ్చలమైనమనస్సుగలవాడై, నాయధీనమైయుండిన 'మోక్ష' సుఖమును బొందుచున్నాడు.

అనియుండుటచేత శాంతమనస్కుడు పవిత్రుడై, ఉత్తమ పదమందుటకుకూడ, అర్హుడగునని మనకు విశదమగుచున్నది. మనోనిగ్రహమున కేమి యుపాయము?

---

మన "చిత్తము" నిజముగ, గాలివలె చంచలమైనది. అది మస్తిష్కములోని జ్ఞాననాడులను దుర్బలముగావించి, స్థిర

బుద్ధి లేకుండ జేయును. అర్జునునివంటి మహాపురుషుడే, మొదట మనస్సును నిగ్రహించ లేకపోయినాడు! ఇక మన మెంతటివా రము!.. వినను శ్రీకృష్ణుడు అందులకు తగిన ఉపాయమును తెలియ జేసినాడు:—

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహంచలం
అభ్యాసేనతుకౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే॥
(గీత—6—35)

అర్జునా! మనస్సు చంచలమైనది. నిగ్రహింపశక్యము గానిదనుటలో సంశయము లేదు. అయినను ( అది పరుగెత్తు విషయములందు దోషములను వెదకుచు) ఆత్మజ్ఞానమునభ్య సించుచు., అట్టిఅభ్యాసము చేత ఆత్మకంటె తక్కినవానియందు (దోషములను తెలిసికొనుచుండుటవల్ల గలిగిన) నిరాశ, వైరాగ్యము చేతను, అట్టిమనస్సును స్వాధీనము చేసికొనవచ్చును. [నిగ్రహించవచ్చును].

అని చెప్పినదానిననుసరించి, విశ్వాసముగలవారమై, వైరాగ్యము [సాంసారిక భోగములలో, ఆయాసము, అసంతృప్తి, మాలిన్యము గల పరిస్థితిని తెలిసికొనుచు ఆసక్తి లేకుండుట] వల్లను, మనస్సును శుభవిచారములందును, ధార్మిక చింతనయందును, ప్రవేశింప జేయుటవల్లను మనస్సు వశమగును. శాంత స్వభావము కలవారమగుదుము. "జ్ఞాపక ముంచుకొనవలెను! మనము ఎపుడు శాంతచిత్తముగలవార మగుదుమో,—అప్పుడే మానవత్వముగలవారమగుదుము".

## 15. పరనింద జేయకుండుట:—

మనకంటె విద్యలోను, బుద్ధిలోను, సంపదలోను, ఉ

న్నత స్థాయిలోనున్న వారిని, లేక హీనదశలో దారిద్ర్యము ననుభవించుచున్న వారిని—ఇతరుల నెవరినైన, అసూయతోజూచుట, పరిహసించుట, యనునదియొక దురభ్యాసము. ఇట్టి దుర్గుణములవల్ల మనుష్యుడు, ఇతరులతో ఋజుమార్గమున వ్యవహరింపక, సంకుచిత హృదయముగలవాడై, ద్వేషభావమునొందును. సాధారణ స్థితిలోగూడ అందరితో శత్రుత్వమునకే దారితీయుచుండును.

ఇట్లు ఇతరులలో చెడుగుణములుఎంచుట, భావించుటవల్ల మనుష్యుని అంతస్సుకూడ [దుర్భావమననమువల్ల] కల్మషపూరితమగును. ఎచటజూచినను దోషము లేకనిపించును. మనస్సుఇట్టి వాతావరణమువల్ల తమోగుణమునుబొంది, సద్గుణములన్నిటిని అణగద్రొక్కును. మనుష్యుడు దుర్మార్గుడగును. పతనమొందును.

కావున మనము ఎల్లప్పుడు సద్భావము [ ఋజుత్వము ] తో ఇతరులనుజూడవలయును. పరిహసించుట, నిందించుటను, విడుచుటకు ప్రయత్నించవలెను. లేనిచో మనము చెడిపోవుటకు ఆలస్యము పట్టదు. ఎట్లైతే స్వచ్ఛమైనకో నీరులో చిన్నరాయి వడవేసినచో అందులో నీరుచలించి మురికితో కలసి చెడిపోవునో, అట్లే మన మానసిక ప్రవృత్తులు, నిందజేయుట యనుభావమువల్ల చలించి దూషితములగును. ఇతరుల దోషములను విచారించుట, చూచుట, చెప్పుటవల్ల,వాని సంపర్కముగల్గి, మనలోకూడ అట్టి దుర్గుణములే చేరును. పరనిందజేయునపుడు మనుష్యుడు తానుమాత్రము గొప్పవాడని తలంచుటసహజము. తనకుతానే పొగడుకొనుటకుకూడ వెనుదీయకుండును. అట్టివానినే "పొగరుబోతు" అని లోకులుదూరు

చుందురు. యశోహీనుడగును. కావున మరచికూడ పరనింద జేయకూడదు. దానివల్లమనమే నష్టపడెదమని తెలియుచున్నది.

ఆరే ద్వేషాంసి సునతర్దధామ” [ఋగ్వేదము 5-45-5]

“ద్వేషమును త్యజించుటయే ఉచితము” (ద్వేషముకల వాడు తనకుతానే కీడుచేసికొనును).... అనువేదసూక్తినిమనము గమనించుటవల్లకూడ నట్టి మనోవికారమును త్యజించవలయు నని తెలియుచున్నది. కావునమనము ఆత్మవికాసమునుగోరుచు, ఇతరులను పరిహాసించక, అసూయ, ద్వేషము-మొదలగు దుస్స్వభావములతో జూడకుండనుండుటకు ప్రయత్నించవ లెను. పండితులను, సాధుపురుషులను, భగవద్భక్తులను, నిరు పేదలను, దీనులను హేళనచేయుట, అసూయతో నవమానిం చుట వెంటనే విడువవలెను.

ఒకవేళ నలుగురిసమక్షములో విమర్శింపవలసి వచ్చి నచో, కపటమువిడచి, దురభిమానరహితులమై, సత్పురుషు లను సద్గుణములతో, (దుర్గుణములనుస్మరించక) వర్ణించిచెప్ప వలెను. చెడు విషయములను తలంచరాదు. కావున స్వలాభ దృష్టితో నొకప్పుడుకూడ ఇతరులు దుష్టులనిచెప్పరాదు. [మరి యుదుష్టునిస్తుతించరాదు ] మంచివారిదోషములను తలంచి నిందింపగాదు.—ఇట్టిపిశునత్వము (పరనింద) ను విడచుటయే మనకు శ్రేయస్కరము, యోగ్యము.

## 16. భూత - దయ:-

మనుష్యుడు అన్ని ప్రాణులయందు సమానమైన దయ గలవాడై యుండవలెను. సర్వప్రాణులనుదయతో జూచుటయే “భూతదయ” యనబడును. ఇట్టిసద్గుణమును ధరించుటవల్లనే

మనము యథార్థమానవత్వమునొందగల్గుదుము.

మనమునహజముగ తల్లిదండ్రులను, భార్యాపుత్రులను మిత్రులను, బంధువర్గమును, ప్రేమతో,(దయతో)జూతుము. కానిదీనిని భూతదయ యనుటకువీలులేదు. ఎట్లనిన—తల్లిదండ్రులు, భార్యా-పుత్రులు మొదలగువారు మనకు సహాకరింతురు, సంతోషపెట్టుదురు. ఇట్లు వారుఅక్కఱకువచ్చుటచే, దయతోజూచుటసాధారణమే గాని, ఎట్టివిశేషము లేదు. ఒకవేళ వారేఅనుకూలముగా లేకున్న, ద్వేషముతో తోసివేయుటకూడజరుగును. ఇట్టిభావము ( మానసికముగ ) నాలోచించిన తెలియును. స్వార్థముతో ప్రాణులపైదయకల్గియుండుట అప్పటివఱకుమాత్రము ప్రతిమనుజునకు సహజమే. అది లెక్కలోనిదికాదు.

యథార్థమైన దయ ఎట్టిదనిన, తన కుటుంబములో వారిని, బంధువర్గము నేగాక సమాజములోని మనుష్యులందఱను [ ఇతరప్రాణులను ] కూడ సమభావముతోజూచుట, మఱియు మనుష్యులనేగాదు పశువులను, పక్షులను, కీటకములను మొదలగు నన్నిప్రాణులను, తన ప్రాణముమాదిరిగా జూడవలెను. అట్టివాడే యథార్థజ్ఞానముకలవాడు.

"ఆత్మవత్సర్వభూతేషు యఃపశ్యతిసపశ్యతి"

"తనప్రాణముమాదిరి సర్వప్రాణులయందు దయగల్గినవాడు ఎవడో అట్టివాడేజ్ఞాని" యనిభావము. ఇదియేయథార్థమైన దయ యనబడును.

భూతదయలేనివాడు, తనపిల్లలకు మిఠాయి కొనిపెట్టుచు పరులపిల్లలను బెదరించుట, తనకుటుంబమువారినే గౌరవించుచు ఇతరులనుదూషించుట, తన పశువుల నితరులచేలలో మేయ

నిచ్చుట, ఇతరుల పశువులను తన చేనిలోనుండి తరిమి వేయుట (కాలు విరుగగొట్టుట) అనవసరముగ పిల్లులు, కుక్కలు, మొదలగు పశువులను, పక్షులను హింసించుట, ఉపవాసము తో వచ్చినవారిని నిర్దాక్షిణ్యముతో వెడలగొట్టుట, తర్వాత తాను తృప్తిగ భోజనము చేయుట, మొదలగు కార్యములు జేయుచుండును. ఇట్టివాడు అపకీర్తినొంది నరకము ననుభవిం పవలసివచ్చును. కావున నిట్టి ప్రవర్తన మనుచితమైనది.

భూతదయుగలవాడు; తలిదండ్రులు వృద్ధులైనను, (వారి వల్ల సహాకారము లభింపకున్నను) వారిని సేవించుట, తన పిల్లలతోపాటు ఇతరుల పిల్లలకుకూడ తినుబండారములనిచ్చుట, తన తోబుట్టువును జూచినట్లు పరస్త్రీలను జూచుట, తన చేని లో నష్టమొందించిన పశువులు (తనవిగాని, ఇతరులవిగాని) అజ్ఞాన జంతువులని హింసించకుండుట, పశుపక్ష్యాదులను మాంసభక్షణ నిమిత్తము జంపకుండుట, ఆకలితో వచ్చినవానిని తనతోపాటు భుజింపజేయుట మొదలగు కార్య కలాపములతో వ్యవహరించుచుండును. కీర్తివంతుడగును.

కావున మనముకూడా నిట్లే ప్రవర్తించుట ముఖ్యమని గ్రహించవలెను. ఎట్టి పరిస్థితియందైనను మనకెట్టి ప్రయోజనమున్నను, లేకున్నను మనవారినైనను, పరులనైనను, సమత్వముతో జూడవలయును. దీనులను, విధివశులైన అమాయకులను జూచి హృదయము ద్రవించి, యథోచితముగ వారికి సహాకరించవలెను. ఇట్టి సద్గుణములు– సత్ప్రవర్తనవల్లనే, మనము యథార్థముగ మనుష్యులమని చెప్పుకొనగల్గుదుము.

జ్ఞాపకముంచుకొనవలెను! ప్రాణులయందు స్వలాభము నుద్దేశించి జూపెడు దయ, యథార్థమైనదికాదు. నిజ

మైన భూతదయ, హేతురహితముగనే యుండును.

## 17. విషయాసక్తి [లోలత్వము] లేకుండుట:-

మనము పవిత్రులము కాగోరినచో విషయాసక్తిలేని వారము కావలయును. అనగా సర్వావస్థలయందు, సమభావముతో, నిత్యజీవితములో జేయు సాధారణకర్మలన్నిటియందు ఆసక్తిరహితులమై యుండవలెను. అట్టివాడు అనాసక్తుడు, లేక యోగియని చెప్పబడును. యోగముగలవాడే యోగి. యోగమనగా సాంసారిక కర్మలన్నియు జేయుచున్నను, వానియందు లోలత్వము (ఆసక్తి) జెందకుండుట యని భావము.

విషయ (భోగ) ములయందు ఆసక్తిగలవాడు, అజ్ఞానవశుడై యుక్తాయుక్తములను విచారింపక వ్యభిచారాది దుష్కర్మలను జేయును. ఇంద్రియలోలుడై విషయములచే బంధింపబడును. అట్టివాడు ధర్మమార్గమునుండి తొలగి ధర్మభ్రష్టుడగును. నరకముల ననుభవించును.

కావున మనము సాధ్యమైనంత తొందరగ, మనలోనున్న విషయాసక్తిని తగ్గించుకొనవలయును. ఎందుకనిన,- సంసారసుఖములు ఆకర్షణీయములుమాత్రమే, కాని శాశ్వతమైనవికావు. మొదట కొంత సుఖమును గల్గించునవిగా దోచినను, వెంటనే అసంతృప్తి, అనారోగ్యము, కళావిహీనత, క్రమముగా ప్రాప్తించును. ఎందరో విషయలోలత్వముగలవారు, దుశ్చర్యలకు లోనై, సంపద, ఆరోగ్యము, ఆయుష్యము క్షీణింపజేసికొనుచున్నారు. మరియు వృద్ధావస్థలో కూడ పునర్వివాహాదులు చేసికొని అసంతృప్తిగలవారై అప

కీర్తితో పతనమొందినవారిని మన కన్నులతో జూచుచునే యున్నాము.

మనుష్యజీవనము అస్థిరమైనది. ఎపుడో ఒకప్పుడు మన శరీరము నశించు (మరణించు) నను విషయము అనివార్యము కదా! జీవితము (జన్మము) నకు తర్వాత మరణము, మధ్యన సుఖ–దుఃఖములు, అనునవి సహజముగా గల్గునుగదా? మరియు—

శ్లో॥ జాతస్య హిధ్రువో మృత్యుః ధ్రువంజన్మ మృతస్యచ,
తస్మాద పరిహార్యేஉర్థేనత్వం శోచితుమర్హసి ॥
(గీత– 2-27)

భావమేమనిన:— పుట్టినవానికి మరణము తప్పదు. చచ్చినవానికి జన్మ తప్పదు. కావున అనివార్యమైన ఈ విషయమందు నీవు దుఃఖించుటచే నుపయోగము లేదు. "అని శ్రీకృష్ణ భగవానుడు, "దేహాభిమాన" దుఃఖమును విడవుమని చెప్పియున్నాడు"

వెపుడైతే దేహము నశించునదో, భోగములుకూడ నశించునవే. అస్థిరములగునట్టి సుఖములందు లోలత్వము అనవసరముగదా! ఎవ్వడైతే మనుష్యుడు ఈ విషయమును గుర్తించి ఆసక్తిలేనివాడై సాంసారిక భోగములను తగ్గించుకొనునో, అపుడే ఆరోగ్యవంతుడై, ధర్మాచరణగలవాడై, పవిత్రుడగును. ఇంతేగాక ఆత్మజ్ఞానముగలవాడై ఉన్నతపదము నొందుటకు అర్హుడగును.

ఇచటకూడ భగవద్వాక్యమును గమనించదగును:—

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర,

అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ||
( గీత- 3-19 )

(అర్జునా) అందువల్ల నీవు ఎల్లప్పుడు ఆసక్తి [ఫలసంగము] లేనివాడవై విహితమైన కర్మను జేయుచుండుము. ఎందుకనగా [ఫలాపేక్ష] ఆసక్తి లేక కర్మలను జేయునట్టి మనుజుడు పరమాత్మను (మోక్షమును) పొందుచున్నాడు.

అని యుండుటవల్ల మనము నిత్యజీవితములో ధనసంపాదనము జేయుట, భార్యాపుత్రిలను [సుఖపెట్టుట] పోషించుట, వారి ఆరోగ్యములను కాపాడుట, గృహనిర్మాణము, వస్తుసంగ్రిహము జేయుట మొదలగు కార్యములు [చేయువలసి వచ్చును] చేయుచున్నను, వాని సుఖములందు [కష్టములందు] లోలురముగాక, ఆసక్తిరహితులమై యుండుటకు ప్రియత్నించవలెను.

"తామర" నీటిలోనున్నను, నీరు తామర [పత్రిము] ను ఎట్లైతే అంటకుండునో అట్లే మనము అన్ని కార్యములు జేయుచున్నను వానికి అంటనివారమై, ఆసక్తిరహితులమై యుండవలెను. అపుడే పవిత్రిలమై, భగవత్కృపకు పాత్రులమగుదుము.

## 18. మార్దవము [కోమలత్వము]:-

మార్దవము అనగా ఇతరులకు. ఉద్వేగము కలిగించని మనస్వభావము. ఇది దైవీగుణము. కఠోరత్వము, రాక్షసగుణము. మనము మానవత్వ వికాసమును కోరు యెడల మార్దవముతో కూడుకొన్న స్వభావము గలవారము కావలెను.

అట్టి సరళస్వభావముగల వ్యక్తి మధురమైన సంభాషణ జేయును. సమాజములో నందరకు మిత్రుడగును. అతడు ఇతరుల దుఃఖమునుజూచి దుఃఖించును. సుఖమునుజూచి సంతసించును. హృదయము, మాటలు, కార్యములు; ఈ మూడింటిలో కపటము లేక, మార్దవము నిండియుండును. ఎట్టిస్థితిలో గూడ కఠోర వాక్యములు బలుకక సరళముగ మాట్లాడుచుండును. దాసదాసీ జనములనుకూడా అనవసరముగ కఠినమైన మాటలచేత నొప్పింపకుండును. ఇట్టివాడే సత్వగుణోపేతుడై భగవంతునకు ప్రియుడగును.

ఈరోజులలో కొందరు సంపదగలవారు, ఉన్నతపదవిలోనున్నవారు, ప్రయత్నముతో కఠినమైన, సంకుచితమైన, భయదాయకమైన దుఃఖమునుగల్గించునట్టి మాటలను బల్కుచుందురు. వారిముఖములో నెల్లప్పుడు "దర్పము" (అసురత్వము) ఉట్టిపడుచుండును. ఇతరులకు భయంకరముగా నుండును. అట్టివారు తాము కఠినస్వభావముగలవారమని తలంపరు. అట్టి స్వభావము ఒక భూషణమని, అది లేనిచో తమ విలువ తగ్గిపోవునని తలంతురు. మొదటినుండి "దర్పము" తోనే ప్రవర్తించువారు రానురాను అదొక అభ్యాసమై, తమ కుటుంబములో వారినికూడ స్నేహభావముతో జూడకుందురు. వారిహృదయములందు ఇట్టివ్యక్తులకు స్థానము, ప్రేమకుతగిన అవకాశము లుండవు. తమఇంటిలోనే ప్రేమను గోల్పోవువారు సమాజములో, పైకి తెలియకున్నను, రాక్షసులుగ భావింపబడుదురు. ఎట్లుమాట్లాడినను ఇతరులకు ఎంతో బాధను కలిగింపజేయుట యొక అలవాటగును.

అట్టి స్వభావముగలవారు, ఏదైన ప్రియమైన, వినయ

మును జెప్పినను, విరసము (రుచిహీనము) గ నుండును. ఇట్టి వారిని మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. . . . దర్పము, కఠోరత లేనిదే తమ అధికారము సరిగా నడవదని, విలువ తగ్గిపోవునని తలంచుట వట్టిభ్రమ. ఎట్లనిన, అధికారి ఎట్టివాడైనను, తన అనుచరులతో ప్రియముగ మాట్లాడుచు, సరళ స్వభావముతో మెలగినచో అట్టివ్యక్తిని, అనుచరులు తమ పాలిటి భగవంతుడని కూడా భావింతురు. విశ్వాసముగలవారై, ఎవరివనులనువారు సక్రమముగ నిర్వర్తింతురు., భయముకల్గించి, ఒత్తిడిచేత జేయించుటకంటె, విశ్వాసముతో, ప్రేమభావముతో జేయించిన కార్యములే ఎక్కువగ ఫలించును.

ప్రతిఉద్యోగి; తనయధికారి మర్యాదతో జెప్పినపనిని, కర్తవ్యమునకంటె ఎక్కువయైనను జేయగలను; కాని ఆయన దబాయింపుచేత చెప్పినచో, ఎందుకు(తొందరగ)జేయవలెను! నేనేమి ఆయనఇంటి నౌకరునా!! యని తన యధికారి సరళ స్వభావము కానివాడైనచో, తప్పక భావించును. నిరుత్సాహితుడై చేయవలసినంతపనికూడ చేయకుండును. ఈ విషయమును,... పదవులలోనున్నవారు (యథార్థము) గ్రహించిన నెంతబాగుండును!

"స్వభావ సరళత్వము" భగవదాంశకమైన గుణము. దానిని గలిగియుండుటకు ప్రయత్నించుట కర్తవ్యమని భావింపవలెను.

"మిత్రస్యాహం చక్షుషా సర్వాణిభూతాని సమీక్షే"
(యజు— 36–18)

"అన్ని ప్రాణులను మిత్రదృష్టితో (కన్నులతో) జూతును:—

మరియు- "మధుమన్మే నిక్రమణం మధుమన్మే పరాయణం"
(అధర్వ- 1-34-3)

— మృదుత్వము నే కురిపించుము, మధురత్వము నే ధరించుము. అని భావము. కావున మనమెట్టి స్థితిలోనున్నను, సమబుద్ధిగలవారమై, కోమలత్వము గలిగియుండవలెను.

మార్దవమనగా, 'అతి దీనత్వము' కాదుసుమా! అతి సరళత్వము బలహీనుని లక్షణము. కావున మనము మిక్కిలి కఠోరత వహించక, అతి దీనత్వము వహించక మధ్యస్థితియగు 'మార్దవము' గలవారమగుటకు ప్రయత్నించవలెను.

## 19. ధర్మవిరుద్ధ కార్యములందు - లజ్జ:-

మానవత్వమును వికసింపజేయుటకు తగిన నియమములు, వేదాది ధర్మశాస్త్రములందు జెప్పబడినవి. మానవ సమాజము, సుఖము, శాంతి, పవిత్రతలనొందు నుద్దేశ్యముతోనే బ్రాహ్మణాది వర్ణములవారికి తగిన ఆచారములు విధింపబడినవి. ముఖ్యముగా ఎక్కువగా నెక్కువ జనులు పాపమును బొందకుండ పవిత్రులై, ఉన్నతిగాంచుటకై, వేదములందు, ధర్మశాస్త్రములందు మానవోచిత ధర్మములు జెప్పబడినందున, మనము నీతియుతముగ, ధర్మవిహితముగనే, నడవవలయును. శాస్త్రవిరుద్ధమైన కర్మలను జేయుటలో 'లజ్జ' గలవారమై, వానిని విడువవలెను.

మనము చెడుకర్మలను లజ్జగలవారమై విడచుట,—ధర్మవిహిత కార్యములను లజ్జ విడచిచేయుట, అవసరమని గ్రహించవలెను. ధర్మవిరుద్ధకార్యము లేవనిన, వృద్ధులైన తల్లి-

దండ్రులను నిందించుట, హింసించుట, భార్యను హింసించుట భార్య,— తన భర్తను అవమానించుట, మద్యపానము జేయుట, మాంసభక్షణము, పొగత్రాగుట, జూదమునాడుట, పరస్త్రీ సంగమము, భక్తులను పరిహాసించుట, మొదలగునవి యగును. ఇట్టి దుర్గుణములవల్ల, మనుష్యుడు ధర్మభ్రష్టుడగును. ఇచట కాళిదాసకవి సూక్తులు గమనించవలెను:—

శ్లో॥ భిక్షో? మాంసనిషేవణం కిముచితం? కిం తేనమద్యంవినా,
మద్యంచాపితవప్రియం? ప్రియమహోవారాంగనాభిస్సహ
వారస్త్రీరతయేకుతస్తవధనం? చౌర్యేణద్యూతేనవా।
చౌర్యద్యూతపరిగ్రహోఽస్తిభవతో? భ్రష్టస్యకావాగతిః॥

ప్రసంగభావమేమనిన.— ఒకసారి భోజరాజు దుస్సహవాసమువల్ల, జూదము నాడుట కలవడిపోయెను. అతనికి యుక్తితో బుద్ధినేర్పుటకై 'మహాకవి— కాళిదాసు' సాధువేషముతో, మాంసము చేతగొని రాజమార్గమున వెళ్ళుచుండెను. మార్గములో ఇతనిని భోజనరేంద్రుడు జూచెను. తర్వాత వారిద్దరకు ఈ క్రిందివిధముగ సంభాషణ జరిగినది:—

రాజు — సన్యాసీ! నీవు మాంసము భక్షింపతగునా?

సన్యాసి:— నేను మాంసమును భక్షింతును. మరియు దానితోపాటు మద్యము లేనిదే వెళ్ళదు.

రాజు:— ఆఁ! ఐతే నీవు కల్లుకూడా త్రాగుదువా?

సన్యాసి:- ఔను. (మద్యము త్రాగుదును) అదికూడ వేశ్యాసంగముతో.

రాజు:— నీవు వేశ్యాగృహమునకుకూడ వెళ్లుదువా! ఐతే నీకు ధనమెక్కడిది?

సన్న్యాసి:- దొంగతనముచేసి- లేక- జూదమునాడి సంపాదింతును.

రాజు:- ఏమి! చోరత్వము మరియు "జూదము" నాడుట నీకు పనికివచ్చునా ?

సన్న్యాసి:- ఔను. (నాస్తిభ్రష్టే విచారః) చెడిపోవు వానికి నట్టిగతియేకదా ! (పట్టును).

"అని చెప్పి 'రాజు' ను జూదమునాడుటనుండి మాన్పించి నాడట. పై ప్రసంగము లో ధర్మవిరుద్ధకార్యములు చేయ రాదను సిద్ధాంతము కనబడుచున్నది. కావున మనము సాధ్య మైనంతవఱకు శాస్త్రవిహిత కర్మలనే చేయుటకు ప్రయత్నిం చవలెను.

శాస్త్రవిహిత కర్మలనగా:- తల్లిదండ్రులకు సేవజే యుట, స్త్రీ;- తన భర్తయనుమతిలో నుండుట, ఉపకారబుద్ధి తో దానము జేయుట, భగవద్భక్తులను గౌరవించుట, సాత్విక ఆహారమును భుజించుట, స్నానానంతరము భుజించుట, ముఖమునందు బొట్టును ధరించుట, దేవాలయమునకు వెళ్ళి సాష్టాంగపడి నమస్కరించుట, గురువులు, పండితులు మొదలగువారిని సత్కరించుట, దీనులకు సహాకరించుట, మొదలగునవి యన్నియు "లజ్జ" విడచి చేయవలెను.

వేదములు, పురాణములు, నీతిశాస్త్రములు, మొద లగు గ్రంథములందు జ్ఞానసారము గలదు. వాని మననము వల్ల విజ్ఞానము కల్గును. అట్టివానిని తెలసికొనకున్నచో, ఏమా త్రమైన ప్రయత్నించి శాస్త్రవిహితముగ నడచుకొనకున్నచో, అతనిని "మనుష్యుడు"అనుటకు అవకాశము లేకుండును! పశు

వర్తనముగలవాడై పతనమొందును. తిరిగి మనుజుడై జన్మిం చుట కర్హతలేనివాడగును.

కావున మనము శాస్త్రవిరుద్ధ కార్యములను 'లజ్జ'గల వారమై (వానిని) విడచి సదాచారముల నలవఱచుకొనుటకు వెంటనే ప్రయత్నించవలెను.

## 20. చపలత్వము లేకుండుట:-

చపలత్వము బుద్ధిభ్రమవల్లగలుగును. అందువల్ల సద్బుద్ధి నశించి మనుష్యుడు పతనమొందుటకు హేతువగును. మనము కొన్ని వ్యర్థమైన చేష్టలు చేయుటవల్ల, శారీరక, మానసిక శక్తులు నశించును. అందుకు 'చపలత్వమే' కారణము. బుద్ధి చాపల్యములేనివాడే సత్ప్రవర్తనగలవాడై పవిత్రుడగును.

ఈ రోజులలో కొందరు కూర్చుండి అనవసర ప్రసంగ ములు చేయుచుందురు. నడచుచు, తిరుగుచు వ్యర్థకర్మలు కూడ చేయుచుందురు. ఏమిపనిలేకున్నను ఇతరుల దోషము లను వర్ణించుట, వదరుట, మొదలగు సందర్భహీనమైన పనులు జేయుచుందురు. కొందరు పగలు-రాత్రి యనకుండ, అందము (సొగసు) సౌకుమార్యము, సుఖము అనువానియందే మనస్సు గలవారై ఆడంబర జీవితమును గడపుచుందురు. మరికొం దరు దుర్మార్గముచేత ధనము సంపాదించుటకు జూదము, పేకాట, మొదలగు నాటల నాడుచుందురు. ఉన్నతదశలో నున్నామనుకొన్నవారుకూడ విశ్రాంతికొరకు వినోదసంఘము (క్లబ్బు) న జేరి, స్త్రీ, పురుష భేదములు లేకుండ పాశ్చాత్య నాగరికత ననుసరించి, జూదముచేత, కొన్ని వినోదములచేత, వ్యర్థముగా కాలమును బుచ్చుచుందురు... పాపము. వీరి

సంపద, 'సద్గ్రంథములను కొని చదువుటకు తగిన యవకాశము నీయదుకాబోలు!'

పై విధముగా భ్రమపూరితమైన యాచారముచేత, జీవితలక్ష్యమే ఆడంబరమనుకొని, చపలబుద్ధిగలవారై అనవసరముగ కాలము, శక్తి, సంపదలను కోల్పోవుచున్నారు. పాశ్చాత్యుల సభ్యతకుఅలవడి, అందులోనేదో సుఖమున్నదని భ్రమించి, వ్యర్థచేష్టలుజేయుటవల్లనే, ఈరోజులలో రూపాయకు అర్ధభాగము దరిద్రులై పోవుచున్నారు. వ్యర్థచేష్టలేవి యనిన:- పరులను నిందించుట, వ్యర్థప్రసంగములు చేయుట, జూదము, పేకాట, మొదలగు నాటల నాడుట, ఆడంబరమైన దుస్తులు ధరించుట, సంస్కృతివిహీనమైన నవలలు, పత్రికలు చదువుట, అధికముగ [నీతిరహితమైన] సినిమాలు చూచుట, వేటాడి పక్షులను, జంతువులను జంపుట, సంస్కారహీనమైన పాటలుబాడుట, [స్త్రీలు] ఎల్లప్పుడు తల వెండ్రుకలను సవరించుకొనుట, స్నో, పౌడరు, సెంటు మొదలగు కృత్రిమ పదార్థములను ఉపయోగించుట, మాటిమాటికిని అందమును జూచుకొనుట, విలువైన, విచిత్రమైన భారతీయ సంస్కృతికి దూరమైన దుస్తులు, జోళ్ళు, మొదలగునవి ధరించుట; పరుల ఇండ్లలో ప్రసంగములుచేయుట, నాట్యములు చేయుట, మద్యమాంసములు కొనుచుండుట మొదలగునవి యన్నియు ఆలస్యము- ప్రమాదము గలిగించునవి యనుటలో సందేహము లేదు.

ఇట్టి కృత్యములలో లాభము, సుఖము, ఆనందము, ఉన్నదనుట భ్రమయేకాని; నిజము లేదు. ఎట్లనిన- జూదము పేకాట మొదలగువానిచేత అధికముగ ధనము నార్జించెదమని

తలంచినను, సంపాదనయేమోకాని, కొందరు ఇల్లు- ముంగిలి లేకుండా నష్టపడువారే కనుపింతురు. ఆడంబరమైన వస్త్ర భూషణాదులు ధరించుటవల్ల ధననష్టము– దాని తరువాత [ఒకవేళ తిరిగి ధరించలేకపోయినచో] దుఃఖము, ఇంట్లో దారిద్ర్యము ననుభవింపవలసివచ్చును... ఇక కృత్రిమ అలంకార పదార్థములు ఉపయోగించనివారి ముఖము, సహజమైన తేజస్సు, అందముతో, ఒకేమాదిరిగనుండును. వానిని రాచుకొన్న వారికి సహజమైన తేజస్సు నశించి, ఆ పదార్థములు రాచినప్పుడు మనోహరముగ కన్పించును. కాని అది పోయిన తరువాత ( లేక– ఉపయోగించనప్పుడు ) కాంతిహీనమై, ముఖము నలుపెక్కి కనిపించును... ఈ పై పరిస్థితులు గలుగుట యథార్థముగా మనము జూచుచున్నాము. వీనివల్ల పై విధములైన అనర్థములేగాక– ప్రతిదానిలో "ధననష్టము" అవశ్యముగదా ! ఇట్టి వ్యర్థచేష్టలన్నియు చపలత్వమువల్లనే చేయబడును. కావునమనము, యథార్థమునుగ్రహించి, చపలత్వమునువిడచి, నీతి, సంస్కారము, విజ్ఞానము, ఆత్మశక్తి, కలిగించు దైవీగుణములను అలవరచుకొనవలెను. సత్కర్మలను జేయుచు, ధార్మిక విషయములు చర్చించుచు, నీతిశాస్త్రములను జదువుటలో మన అమూల్య సమయమును వెచ్చించవలెను.

మంచి మిత్రులనుజేరి, సద్గుణముల నలవరచుకొనుటవల్ల, స్థిరబుద్ధిగలిగి, సద్భావము లేర్పడును, "చపలత్వము" వదలిపోవును. అపుడే మనము ప్రపంచములో కీర్తివంతులమై పవిత్రులమగుదుము. తుదకు భగవంతుని కృపకు పాత్రులమగుదుము.

## 21. తేజస్సు [ప్రతిభ]:-

భగవంతుడు ఒకడేయైనను అనేక నామరూపములతో వ్యవహరింపబడుచున్నాడు. కొన్ని అవతారములే కాకుండా, ప్రపంచములో తేజస్సంపన్నమైన ప్రాణులు- పదార్థములు గూడా భగవత్స్వరూపములనియు, భగవదంశము చే జనించి నవనియు, వేదాది ధర్మశాస్త్రములందు జెప్పబడినది.

అన్ని ప్రాణులలో మనుష్యుడే శ్రేష్ఠుడు. మనుష్యుని లో విజ్ఞానము, ధైర్యము మొదలగు ప్రతిభనొందించుగుణము లువికసించుటకు ముఖ్యముగా అంతస్సులోనున్న "ఆత్మ" యే కారణము. ఆత్మ, భగవదంశచే జనించినది. కనుకనే ప్రతి వ్యక్తి ఏదో కొంత ప్రతిభావంతుడగును.

శ్లో॥ అహమాత్మాగుడాకేశ! సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చమధ్యంచ భూతానామంతఏవచ ॥
( గీత- 10-20 )

"అర్జునా! అన్ని ప్రాణుల (శరీరము ధరించి) హృదయ మందున్న 'ఆత్మను' నేనే. వాని ఉత్పత్తి, స్థితి, నాశములకు కూడా కారణమైనవాడను నేను" అని శ్రీకృష్ణభగవానుడు చెప్పుటవల్ల మనకు పై విషయము స్పష్టమగుచున్నది.

కాని "ఆత్మ" సహజమైన తేజస్సుగలదేయైనను, ఏ శరీరమునైతే ధరించునో, అందున్న మనఃప్రవృత్తుల ననుస రించి మార్పుజెందును. విజ్ఞానయుక్తమైనద్ది, నియమితేంద్రి యములుగలది యగు శరీరమైనచో, "తేజస్సు" వృద్ధినొం దును. అజ్ఞానమైన మానసికప్రవృత్తులు అధికముగనున్నచో, వానిచే "తేజస్సు" కప్పబడును. ముఖ్యముగా ఆత్మయొక్క

(తేజస్సు) శక్తి వృద్ధియగుటకు— తగ్గుటకు మనలోనున్న మానసిక పరివృత్తియే కారణము.

కావున మనల్లోనున్న ఆత్మయొక్క తేజోవృద్ధిజేయుటకు మనము సద్విచారములు, సదాచారములు కలవారముగావలయును విజ్ఞానసంపాదన, విహితకర్మానుష్ఠానమువల్ల, ప్రపంచములో ఉత్కృష్టకార్యములుజేసి, 'ప్రతిభ' సంపాదించగలుగుదుము.

భగవదంశసంభూతులైన, జగద్గురువులు, శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు మొదలగు మహనీయులు తమ 'ఆత్మశక్తి'చేతనేగదా! ప్రపంచములో నాస్తికత్వమును, మూఢత్వమును దొలగించి, ఎందఱనో, విజ్ఞానులుగాజేసి ముక్తిమార్గమును జూపియున్నారు. ఇకముందుగూడా జనులు పవిత్రులై తరించుటకు తగిన ఉత్తమపథమును సూచించి, తమ అమూల్యమైన సిద్ధాంతములను లోకోపకారార్థము ప్రచారము చేసిపోయినారు. ఇది ఎంత మహత్తరకార్యము! ఎన్నెన్నో ఘనకార్యములుజేయువచ్చును. కాని భగవంతుని పొందుటకు, సులభమార్గమును జూపువారేరి ?... ఇపుడు వారినామ ముచ్చరించినంతమాత్రమున్న, మనము కొంత పవిత్రులమగుచున్నాము !! అంటే, వారి "యాత్మశక్తి" ఎంత గొప్పది!

ఇంతెందులకు— గాంధీగారి పేరు తెలియనివారుండరు. ఆయన పాశ్చాత్యులకాధీనమైన, పవిత్రభారతావనిని ధర్మపథమున, కృత్రిమములు, యుద్ధముకూడ లేకుండా స్వతంత్రముగా పంచిరిగదా! ఇది సామాన్యకార్యమేనా? ఇందులకు ఆయన ఆత్మ, (తేజస్సు) శక్తియే కారణము. అందులకే మహాత్ముడు

అని ప్రపంచఖ్యాతి నొందినాడు. కావున మనము మొదట- "పురుష ఏవేదగ్ంసర్వం" ఈ ప్రపంచమంతయు పరమాత్మ స్వరూపము, అను విశ్వాసముగలవారమై ఇంద్రియ సుఖము లందు మనస్సును ప్రవేశింపకుండ నియమించి, సాధ్యమైనంత వఱకు ధార్మికబుద్ధితో సత్కర్మలు జేయవలెను. మరియు సత్పురుషుల సహవాసము, ధార్మిక విషయములను చర్చించుట, చదువుట వల్ల మనము తప్పక ఆత్మతేజమును వృద్ధిజేసి కొనగలుగుదుము. శక్తివంతులమై ప్రపంచమునందు ఉత్కృష్ట కార్యములుజేసి, ప్రతిభావంతులమగుదుము. అపుడే జన్మ సార్థకము గదా !

కావున ఇట్టి వివేకముచేత (భగవంతునిగుఱించి) ఉత్తమ కర్మలనుజేయుచు, ఉన్నతపదము నొందుటకు, ముఖ్యావసరమైన ఆత్మశక్తిని వృద్ధిజేసికొనుటకై ప్రయత్నించవలెను.

జ్ఞాపకముంచుకొనవలెను! మనుష్యజన్మ వచ్చినందులకు కృత్రిమములేని "ప్రతిభ" ను సంపాదించవలెను. సత్కీర్తి లేనివాడు పుట్టిననేమి! గిట్టిననేమి!!

## 22. క్షమ [ఓర్పు]:-

తగినంత శక్తిసామర్థ్యము లున్నప్పటికిని, తప్పుచేసిన వానిని (ముందు సరిదిద్దుకొనుటకు అవకాశమునిచ్చి) కఠినోక్తులు బలుకకుండుట, దండించకుండుటయే "క్షమ" యనబడును. ఈ గుణము మనుష్యునిలో దేవత్వమునుగూడ దర్శింప జేయును.

సాధారణముగా పొరపాటు ప్రతి మనుజునివల్ల జరుగుచుండును. తాను ఎప్పుడుకూడ పొరబడకుండ నడచుకొనగల్గి

నచో ఇతరులను శిక్షించవలెను! కాని అట్లు జరుగుట చాల అరుదు. ఎంత విజ్ఞానవంతుడైనను, ఎప్పుడో ఒక చిన్న పొర పాటుచేయును. మనుష్యునకు పరిస్థితులననుసరించి పొరబడుట సహజమైనపుడు, సాధ్యమైనంతవరకు ముందుజరుగకుండా జాగ్రత్త వహించవలెను. కాని సాధారణమైన తప్పునుకూడా క్షమించక, దండించుట రాక్షసత్వము యగును.

కావున మనుజుడు (చేయరాని దుష్కార్యములుతప్ప) మామూలు పొరపాట్లు తనకు సంబంధించినవారైనను, సేవకులైనను, పరులెవరైనను చేసినచో ఒక సారి, రెండుసార్లు క్షమించవలయును. తర్వాతకూడ తప్పుచేసినవానిని దండించ వచ్చును. ఇదిరాజునకు ముఖ్యగుణము. దొంగతనముచేయుట, జీవహింసచేయుట, వ్యభిచారముచేయుట, మొదలగు అతి దుష్కృత్యములు చేసినవారిని వెంటనేదండించుట అవసరము ఎందుకనిన ఇట్టివి మానవుడు చేయకూడనివి.

ఇక సేవకుడు-ఆలస్యముగ వచ్చుట, ఏదైన వస్తువు వారిచేత జారి పగిలిపోవుట, భార్య-సకాలమునకు భోజనము పెట్టకుండుట, శాకములో-ఉప్పు- కారము తక్కువ-ఎక్కువ యగుట, పిల్లలను- పడగొట్టుట, చిన్నపిల్లలు- పుస్తకములు చింపుట, పలక పగులగొట్టుట, ఇతరులు- పాలు, లేక ఇతర పదార్థములు పారబోయుట, మొదలగు పొరబాట్లు సామాన్యముగా ప్రతి ఇంటిలో జరుగుచుండును. ఇవి సాధారణమైనవి. అజాగ్రత్తవల్ల జరుగునవి. కొంత నష్టము, కష్టము కలిగినను క్షమించవలసినవగును.

ఇట్టి స్థితియందు మనము "ఓర్పు వహించి" ముందు జాగ్రత్తపడుటకు అవకాశమివ్వవలెను. ఇట్లు ప్రయత్నించుట

వలన మనలో ఉత్తమగుణములు వికసించును.

కాని ఈ రోజులలో కొందరు తమ సేవకులు, భార్యాపిల్లలు మొదలగువారివల్ల చిన్నతప్పుజరిగినను కఠినమైనమాటల చేత తిట్టుచు ప్రమాదకరముగా దండింతురు. ఏమాత్రమైన ఓర్పులేక దండనచేయువ్యక్తి మనుష్యుడెట్లగును?

మనకెట్టి కష్టములుప్రాప్తించినను, నష్టముకలిగినను, ఇతరుల వల్ల కొన్నిదోషములుజరిగినను ఓర్పువహించియుండవలెను. మానవత్వపోషణముచేయుటకు మనము క్షమతో ప్రవర్తించుటకు ప్రయత్నించవలయును' అపుడు ప్రపంచమందు యశస్సుతోపాటు భగవంతునకు ప్రియులమగుదుము. భగవద్వాక్యము నేగమనింతము :—

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః కరుణఏవచ।
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఃఖక్షమీ ॥
సంతుష్టస్సతతంయోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్తస్సమేప్రియః ॥
( భగవద్గీత– 12-13, 14 )

భావము:— (ఎవడు) అన్నిప్రాణులయందు ద్వేషములేక, స్నేహభావమును జూపువాడును, (దయగలవాడును) శరీరాదులయందు మమకారము లేనివాడును, (దేహమేయాత్మయను తలంపులేనివాడును) సుఖము–దుఃఖమును సమానముగ జూచువాడును, ఓర్పుగలవాడును, దైవవశంబున లభించిన అన్నపానాదులతో సంతుష్టి నొందువాడును, ధ్యానపరుడును, నియమింపబడిన మనోప్రవృత్తి గలవాడును, సందేహము లేనివాడును, నాయందుంచిన మనోబుద్ధులు గలవాడును — అగునో, అట్టివాడు నాకు స్నేహితుడు.

అని యుండుటచేత మనము– మనతోపాటు భగవంతు నకు కూడ ప్రియత్వము చేయువారమైఅన్నిపరిస్థితులయందు అవసరమైన "ఓర్పు" కల్గియుండుటకు ప్రయత్నించవలెను. పై జెప్పిన శ్లోకములో వివరించిన గుణములుకల్గుటకు కూడ యథాయోగ్యముగ యత్నించుటయే మనకర్తవ్యము,

## 23. ధృతి [ధైర్యము]:-

"ధృతి" యనగా, "ధైర్యము" దీనితో 'సహనము' 'సంతోషము' అనునవికూడ కలసియుండును. ఇవి యన్నియు "ధైర్యము" నకు చాల ప్రేరణ కల్గించునవి. మనము ఎచ్చట నున్నను, ఏమిచేయుచున్నను 'ధైర్యము'అనునది చాల సహకరించును. కొండంత ఆపదవచ్చినను, భయంకరమైన, కష్టదాయకమైన పరిస్థితులు ఏర్పడినను ధైర్యమును విడువరాదు. తప్పక మనము తిరిగి మంచి స్థితికి నెమ్మదిగా రాగల్గుదుము.

ఎంతటి విషమపరిస్థితియందైనను "ధైర్యశాలి"చింతింపడు.... ధైర్యములేనివాడు దేనినికూడ విచారించలేడు, మాట్లాడలేడు. చేయజాలడు, అట్టివానినే "పిరికిపంద" యందురు. వాడు ప్రపంచములో నున్నను, లేనివానితో సమానమే యగును .. కావున మనకు "ధైర్యము" ఉండుట చాల ముఖ్యము.

కాని ఇది చెడుపనులకొఱకుమాత్రము వహించరాదు. ఉదా — దొంగతనము చేయుట, పరస్త్రీల నపహరించుట, ప్రాణులను హింసించుట, గురువులను, పెద్దలను దూషించుట, తలిదండ్రులను దండించుట, అబద్ధములాడుట, స్త్రీ: తనభర్తను ఎమరించి– దుర్భాషలాడుట, పరగృహములకు నిప్పంటించుట, ధనాశచేత ఇతరులకు ద్రోహము (అపాయము) జేయు

ట, మొదలగు దుర్మార్గములందు ధైర్యముగాక– 'భయము' కలిగి యుండవలెను. ఒకవేళ పైకృత్యములందు ధైర్యము వహించెనా! అట్టివాడు ఇహపరములందు, నరకము ననుభవింపక తప్పదు. అది ధైర్యమనబడదు. కావున దుష్కర్మల యందుగాక, సత్కార్యములు జేయుటలోనే "ధైర్యము" వహించియుండుట యావశ్యకము. ఇచట భర్తృహరి వాక్యములు గమనింతము —

— "నిందంతునీతి నిపుణాః యదివాస్తువంతు,
లక్ష్మీస్సమావిశతు గచ్ఛతువాయథేష్టమ్
అద్యైవవామరణమస్తు, యుగాంతరేవా,
న్యాయ్యాత్పథః ప్రవిచలంతిపదంన, ధీరాః ||
(భర్తృ–నీతి– 74)

—నీతికోవిదులైనవారు, ఇతరులు నిందించినను, పొగడినను, సంపదలు వచ్చినను, దరిద్రము వచ్చినను, మరణము (గల్గినను) ఇపుడేయైనను, వేఱొకయుగమందైనను, ధైర్యముగల వారు, న్యాయమార్గమందు (నడచుటకు) ముందు – వెనుక లాడరు.

మరియు యథార్థమైన "ధృతి" గలవాడు ధర్మమును దప్పక అన్నిటిచేత జయింపబడి, ప్రపంచమునందు యశస్సును బొందును. అతని లక్షణము లెట్టివనిన:—

— కాంతాకటాక్ష విశిఖానఖనంతియస్య
చిత్తంన నిర్దహాతి కోపకృశానుతాపః ।
కర్షంతిభూరి విషయాశ్చనలోభపాశైః
లోకత్రయంజయతికృత్స్నమిదం, సధీరః॥
(భర్తృ–నీతి– 75)

భావము:— ఎవని మనస్సు, స్త్రీల చూపులను— బాణములచేత చలింపజేయదో, ఎవని హృదయము [ను] 'కోపము' అను అగ్ని దహింపదో; ఎవని మనస్సు 'అత్యాశ' అను త్రాళ్ళచే [కట్టి] లాగబడదో, అట్టివాడే 'ధీరుడు'. అట్టి ధైర్యవంతుడు, ముల్లోకములనుగూడ జయించగల్గును.

అనుటచేత 'ధైర్యమే' మనుజునకు ఉత్తమశక్తి నొసంగునని తెలియుచున్నది. ఇక ఎల్లప్పుడు ధైర్యవంతులమై, సుఖ-దుఃఖములను, కష్టకాలమును, సాంసారికముగ, చికాకులను, ఎదుర్కొనవలెను. సర్వావస్థలయందును, సమబుద్ధి గలిగియుండుటకు ప్రయత్నించుటవల్ల, పవిత్రులమై సత్కీర్తిని గడింతుము. "మనము [యథార్థముగ] 'మనుష్యులము' కావలెనన్నచో; 'ధైర్యము' తో ప్రయత్నింతము."

## 24. శౌచము:-

శౌచము, అనగా పవిత్రత. ఇది రెండువిధములుగనుండును. 1] బాహ్య [స్వచ్ఛత] శౌచము, 2] అంతరంగ శౌచము. ఈ రెండువిధములైన పవిత్రతలతోనుండుట, మనుజుల కావశ్యకము.

ఈ రోజులలో మనకు బాహ్య [శౌచము] స్వచ్ఛతకు లోటులేదు. శరీరము, వస్త్రములు, భవనములు, మొదలగు వాని పరిశుభ్రతకొఱకై, అత్యంత శ్రద్ధతో ప్రయత్నముచేయుట జరుగుచున్నది. ఉదా:— సబ్బుతో రోజుకు రెండువేళల స్నానముచేయుట, ఉదయము-సాయంత్రము [2సార్లు] వస్త్రములు [మార్చి] ధరించుట, భోజనానంతరముకూడ సబ్బుతో, చేతులు-ముఖము కడగికొనుట, [స్త్రీలు] కృత్రిమ-

సౌందర్యవస్తువు లుపయోగించుట, కుర్చీలపై కూర్చుండుట, భవనములు శుభ్రపరచి, సున్నముతో పలువిధములైన రంగులతో నలంకరించుట, మొదలగునవి; యెన్నో దైనందిన జీవితములో పరిశుభ్రతావాదక చర్యలు జేయబడుచున్నవి. క్రొత్తవారు కొందరు జాగ్రత్తతో నేర్చుకొనుచున్నారు.

కాని ఇవియన్నియు పైకిమాత్రమే స్వచ్ఛమైనవి. స్నానాదులతో మాత్రమే ప్రాణి స్వచ్ఛమై ముక్తినొందగల్గినచో-ఎల్లప్పుడు నీటిలోనుండు చేపలు, మొసళ్లు, మొదలగునవి జన్మతోనే "ముక్తి" నొందగలవు!! కావున ఇంతమాత్రముతోనే సంపూర్ణమైన పరిశుభ్రత కాజాలదు. శరీరముపై మురికి పోవుటకు, స్నానము జేయుట, మాసిన గుడ్డలువిడచి, శుభ్రమైన దుస్తులు ధరించుట,- మాదిరిగనే; మనలోనున్న దుర్విచారములను తొలగించి, సద్భావములు గలవారమగుట, అసూయను విడచి, సంతోషమును కల్గియుండుట, మొదలగు "అంతశ్శుద్ధి" ప్రయత్నములు చేయుటకూడ మన విధి. ఇవి హృదయపూర్వకముగ పవిత్రముజేయునవి. బాహ్యమాలిన్యముతో బాటు; అసత్యము, ఈర్ష్య, ద్రోహబుద్ధి, కపటము మొదలగు అంతర్మాలిన్య [భావ] ములనుకూడ పరిశుభ్రము చేయవలయును. దుర్భావములను; సత్యము, దయ, పరహితచింత మొదలగు పవిత్రగుణములతో కడగివేసి, మన-శ్శరీరములను నిర్మలముగ నుంచవలయును. మనుష్యుని అంతర్భావము ఎప్పుడైతే స్వచ్ఛమగునో; అపుడే అతడు పవిత్రుడనబడును. కావున మనము కేవలము బాహ్యస్వచ్ఛతయేగాకుండ; అంత-ర్బాహ్య స్వచ్ఛతలకొఱకు ప్రయత్నించుటయే ముఖ్యమని గ్రహించవలెను.

వాస్తవమైన "శౌచము" (శుద్ధి) ఆత్మజ్ఞానమువల్లనే యగును. అట్టివానికి, సత్యము, ప్రేమ, విశ్వాసము, ఉదారము, శ్రద్ధ, భక్తి మొదలగు ఉత్తమ గుణములు వికసించిన హృదయ (కమల) ముండును. అందులకు ప్రయత్నించుట మన కర్తవ్యము. అదెట్లనిన:—

—ఆత్మానదీ, సంయమ పుణ్యతీర్థా,
సత్యోదకా, శీలతటా, దయోర్మిః।
తత్రాభిషేకం కురు, పాండుపుత్ర!
నవారిణా శుధ్యతి, చాంతరాత్మా॥ (మహాభారతము)

(ధర్మనందనా!) ఆత్మరూపమైన నది; సంయమరూపమైన, పవిత్రస్థలము; సత్యమను జలముండి; శీలమను ఒడ్డుగల్గియుండునో; మరియు నట్టి జలములో, దయాతరంగములు, లేచుచుండునో; అట్టిచోట నీవు స్నానముజేయుము. "వట్టినీరు" అంతరాత్మను "శుద్ధి" చేయలేదు, అని భావము.

దీనివల్ల బాహ్యశుద్ధికంటె; 'అంతర్భావశుద్ధి'యే ముఖ్యమైనదని తెలియుచున్నదిగదా! ఇకనైనను మనము ఇతోధిక ప్రయత్నముతో మనోభావములను నిష్కల్మషముగా వించుట యవసరమని గ్రహించి, నిర్మలముగ నుండుటకు ప్రయత్నింతము. వెలుపలి శుభ్రతకై, మనము సహజముగ ప్రయత్నించుచుందుము. వెలుపలి స్వచ్ఛత చాల సులువైనదిగదా!

"ఎవని హృదయము స్వచ్ఛమైనదో; వానియందే భగవంతుడు (అనుగ్రహముతోను) ండును. భగవంతునకు ప్రియులమగుటయే మన కర్తవ్యము.

## 25. ద్రోహముచేయకుండుట:-

మనుష్యుడెప్పుడైతే స్వార్థపరుడగునో, అత్యాశగలవాడగునో, అపుడు అతని అంతర్భావము సంకుచితమై, ఇతరుల యందు ఈర్ష్యకలిగించును. తర్వాత "ద్రోహబుద్ధి" గలవాడగును. అందఱి సుఖ-సంపదలు తనకే కావలెనని, ఇతరులుఅనుభవింపగూడదని తలంచి, వారికి "ద్రోహము" చేయ తలపెట్టును. తనకెట్టి ప్రయోజనమున్నను, లేకున్నను పరుల సుఖమును సంపదనుజూచి, ఈర్ష్యాజ్వాలక ధ్వంసము చేయబూనును. ఇది పాపకర్మలలో ముఖ్యమైనది; నరకమునకు హేతువైనది.

మన సమాజములో ఇట్టి భావముగలవారిసంఖ్య పెరిగిపోవుచున్నది. పరులకు ద్రోహముచేసి, వారి-ఆస్తి-పాస్తులను హరించి ప్రాణములనుకూడ తీసినవారిని మనము అచ్చటచ్చట చూచుచున్నాము. అట్టి ద్రోహకృత్యములుచేసి, పరద్రవ్యమునపహరించి, తాత్కాలికముగ సౌఖ్యము ననుభవించినను, చివరకు పాపము ఫలించి, నానాకష్టముల ననుభవించి, కుటుంబముతోకూడ, నాశమొందినవారి చరితములుకూడ వినుచున్నాము.

ద్రోహముచేయుట, రాక్షసగుణము. మానవునకు పతన హేతువగును. ద్రోహబుద్ధిగలవాడు లోకశత్రువై, దుర్మార్గ వర్తనుడగును.

శ్లో॥ ఏతాంద్రుష్టిమవష్టభ్య, నష్టాత్మానోల్పబుద్ధయః।
ప్రభవంత్యుగ్ర కర్మాణః క్షయాయ జగతోహితాః॥
( గీత– 16-9 )

"దురభిప్రాయముగలవారై ఆత్మజ్ఞానము (వివేకము) లేనివారై, అల్పబుద్ధిగలవారై హింస, ద్రోహములచేత లోకనాశమునకు యత్నింతురు. ఇట్లు క్రూరకర్మలుచేయువారు (రాక్షసులు) లోకశత్రువులే యగుదురు."

అనుటచేత మనము 'ద్రోహబుద్ధి' ని ప్రయత్నముతో విడచి, పరహితము చేయవలెను. పరోపకారార్థము సాధ్యమైనంతవఱకు, మన శరీరము, బుద్ధి, సంపదలను వినియోగించవలెను. ఎప్పుడుకూడ పరులను దుఃఖింపజేయకూడదు. వారి దుఃఖమునుజూచి, మనము సంతసించగూడదు. ఎవరి వారి పాప-పుణ్యముల ననుసరించియే,- 'కష్ట—సుఖములు' ప్రాప్తించును. కావున సాధ్యమైనంతవఱకు పరహితమునే జేయవలెను. అట్టివారే సత్పురుషులనబడుదురు.

—ఏ తే సత్పురుషాః పరార్థ ఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే,
సామాన్యాస్తు పరార్థముద్యమభృతః స్వార్థావిరోధేన యే।
తేమీ మానుష రాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే,
యేతు ఘ్నంతి నిరర్థకం పరహితం తే, కే నజానీమహే॥

( భర్తృ—నీతి— 64 )

—"తమ కార్యములు విడచిపెట్టి పరుల కుపకారము జేయువారు "సత్పురుషులు". తమ కార్యములు చేసికొనుచు పరుల కార్యములు జేయువారు "మధ్యములు". తమ కార్యములు ఫలించుటకు, ఇతరుల కార్యములను జెడగొట్టువారు "రాక్షసులు" నబడుదురు. ఇక తమకు నష్టమేమి లేకున్నను, పరులకు 'ద్రోహము' జేయువారికి, ఏమి పేరు పెట్టవలయునో!! తెలియుట లేదు."

అని యనుభవజ్ఞుడైన భర్తృహరి చెప్పియున్నాడు.

అట్టినీతిని, మనము శ్రద్ధతో గ్రహించి, సాధ్యమైనంత తొందర
గా "ద్రోహము" ను దుర్గుణమును విడువవలెను. అప్పుడే ఈ
లోకమందు సత్కీర్తినిపొందుటకు, భగవంతునకు ప్రియులము
గుటకును, అవకాశముండును.

## 26. అభిమానము [గర్వము] లేకుండుట:-

మనకు "అహంభావము" పలువిధములుగ కలుగుచుం
డును. ధనవంతులమనియు, పండితులమనియు, సౌందర్యవం
తులమనియు, అధికారులమనియు, ఉత్తమ వర్ణస్థులమనియు,
ఇట్లు నానావిధములైన గర్వములచేత ఆత్మసామ్యవిజ్ఞాన దృష్టి
నశించును. ఇతరులు యోగ్యులైనను, ఉత్తములైనను, గుర్తిం
చలేక నీచులనితలంచుట జరుగుచుండును.

మనము ఉచిత విచారణచేసినచో, అభిమానము
(అహంకారము) అనునది, మనుష్యుని సహజమైనసాత్త్విక శక్తిని
హరించి, పతనమొందించుటకు దారితీయునట్టి అవగుణమని
స్పష్టమగును. కావున ఎన్నటికినిగర్వించరాదు.

దురభిమానముగలవాడు, తనముందు, పరుల విద్య,
సంపద, ఆచారము, న్యాయవర్తనము మొదలగునవి జూచి,
సహించలేక తానుమాత్రము తక్కువనా? యనిభావించి,
వారిని లెక్కచేయకుండును. ఇతరులవద్ద నేర్చుకొనదగిన విష
యమునైనను, తెలిసికొనడు. గర్వము (దంభము) తో ప్రవ
ర్తించుటవల్ల, అప్పుడుగాకున్నను మరొకప్పుడైనా, తనకంటె
చిన్నవారి సమక్షమున అవమానమునొంది, అపయశస్సును
బొందును.

పూర్వకాలమునందు అభిమానము- (గర్వము) చేత

ప్రవర్తించి, తుదకు సర్వనాశనమొందినవారి చరిత్రలుకూడ మనము చదువుచున్నాము. వినుచున్నాము. "సుయోధనుడు" (దుర్యోధనుడు) "రావణుడు" వీరిద్దరుగొప్పపండితులు. అమితమైన శక్తి, సామర్థ్యములుకలవారే, విశేషప్రతిభావంతులే, కాని "అభిమానము" వల్లనే వివేకహీనులైనారు.. ఎదుటివారి యోగ్యతను గుర్తించియుండికూడ (మూర్ఖులై) ఎదుర్కొనుటకు సిద్ధపడినారు:- ద్వావేవ పురుషౌమూర్ఖౌ, దుర్యోధన-దశాననౌ। గోగ్రహం, వనభంగంచదృష్ట్వా యుద్ధంచచక్రతుః॥" సుయోధనునిపేరు దుర్యోధనునిగామారినది. వంశక్షయమై. యశోహీనుడై, తుదకు భీమునిచేత జంపబడినాడు. ఇక రావణుడు, లంకను సర్వనాశనమొందించి, శ్రీరాముని చేతహతుడైనాడు. ఈ చరిత్రలుమనకందఱకు తెలిసినవేకదా! ఇట్లే మధ్యకాలములోకూడ కొందఱు రాజాధిరాజులు, పండితులు, గర్వముతో ప్రవర్తించి, తుదకునశించిరి. ఐనను ఈ రోజులలోకూడ ఉన్నతదశలోనున్నవారు ( లేనివారుకూడ ) కొందఱున్నారు. ఇట్టివారిని మనము ప్రత్యక్షములో జూచుచునే యున్నాము. వీరిగతికూడ అంతేకాకతప్పదు.

కావున పండితుడైన-వినయముతో, సంపదగలవాడైన-దానముతో, ఆచారముగలవాడైన-ఓర్పుతో, అధికారము గలవాడైన-దయతో, ప్రవర్తించవలెను. తనకన్న చిన్నవాడైనను, యోగ్యత-ననుసరించి సత్కరించవలెను.

ఇట్టివిషయమును గ్రహించి, మనము, అభిమానము విడచి, సరళముగప్రవర్తించుటవల్ల, ప్రపంచమందు ప్రతిభావంతులమగుదుము. ఇక వర్ణము, రూపము, విద్య, సంపద, శక్తి, అధికారము మొదలగునవి ఎంతటి ఉన్నతస్థాయిలో ను

న్నను; అవిగలవారు గర్వింపరాదు. ఇతరులు-తక్కువ వర్ణస్థు లైనను, కురూపులైనను. శక్తిహీనులైనను, అజ్ఞానులైనను, దరిద్రులైనను, వారిని, అందఱిముందు,-లేక ఒంటరిగ నొక ప్పుడుకూడ నిందించకూడదు. మనకున్న శక్తి-సంపదలతో తృప్తిజెంది, సంతోషముతో నుండవలెనేగాని, అభిమానము తో గర్వించరాదు. దంభము, దర్పముతో ప్రవర్తించుట మానవ లక్షణమేకాదు.

శ్లో॥ దంభోదర్పోభి మానశ్చ, క్రోధః పారుష్యమేవచ ।
అజ్ఞానం చాభిజాతస్య, పార్థ! సంపదమాసురీమ్ ॥
(గీత-16-4)

"అర్జునా! దంభము, దర్పము (గర్వము) అభిమానము క్రోధము, కఠినత్వము, అవివేకము. ఈ గుణము లన్నియు రాక్షసాంశమున బుట్టినవారికుండును,,... అని శ్రీకృష్ణపర మాత్ముడు చెప్పియున్నాడు.

పైగుణములన్నియు మనము ప్రయత్నముతో విడువ వలెను. (అభిమానమునువిడచి) తలిదండ్రులను, గురువులను, సత్పురుషులను గౌరవించుట, పూజించుటయే శ్రేయస్క రము. అపుడేపవిత్రులమై ఇచట యశోవృద్ధినిగాంచి, చివరకు భగవత్కృపకు పాత్రులమగుదుము.



మనము ఇంతవరకు వేర్వేఱుగ, 26 గుణములను గురిం చి వివరముగ చర్చించి, తెలసికొన్నాము. శ్రీకృష్ణుడు లోక కల్యాణార్థము, దయతో (అర్జునిని నిమిత్తముగజేసి) ఉపదే శించినందుననే ఈరోజుమనముకూడ, తెలిసికొనుటకు, పవి త్రులమగుటకు అవకాశముకలిగినది, ఇందుకు మనము యోగే

శ్వరుడైన, శ్రీకృష్ణునకు కృతజ్ఞులముగా నుండవలెను.

ఇంతవఱకు సూచించిన "దైవీగుణములు" సాధ్యమై నంతవఱకు అలవఱచు కొనుటకు, మన హృదయమును నిర్మలము గావించి, సద్భావములకు స్థానము కల్పించవలెను. అపుడే మనలో "యథార్థమానవత్వము" వికసించును. ఉత్తమవిచారములవల్ల, ఉత్తమగుణములు వచ్చును. ఉత్తమ కర్మలనే చేయును. అట్టి ఉత్తమపురుషుడు, ప్రకృతి వాసనల నుండి విముక్తుడై, పరమపదమును బొందును.

—// ఓం తత్సత్ //—

## మానవుని సామాన్యధర్మలు.

మనము నిత్యజీవితములో సదాచారులమగుటకు; కొన్ని "సామాన్య ధర్మములు" కూడ గలవు. వీని యాచరణవల్ల కొన్ని పాపములను అంటకుందుము. సత్ప్రవర్తనగలవారమై పవిత్రులమగుదుము. ప్రపంచములో ఆదర్శస్వరూపమైన కీర్తినిగూడ పొందగల్గుదుము. మానవ "ధర్మశాస్త్ర"మగు, "మనుస్మృతి" లో నిట్టి సాధారణ ధర్మములకుకూడ, ప్రాముఖ్యము నివ్వబడినది. భగవదంశ సంభూతుడైన మనువు జెప్పిన కొన్ని ధర్మలు ఈ క్రింది విధముగనున్నవి. ఔషధము వలె కొంత ఇష్టము లేకున్నను, గ్రహించదగినవి– "యద్యే కించ మనురవదత్తద్భేషజమ్" అని పెద్దలంగీకరించియున్నారు.

1. తల్లిదండ్రులను, ఆచార్యులను, సోదరులను, అత్తమామలను, తాతలను, వృద్ధులను; ప్రణామము, సేవ మొదలగు వానిచే సన్మానించుట.

2. ప్రపంచములో (దేశములో)నున్న విద్వాంసులను, పండితులను, రాజులను; ఆదరించుట.

3. ఉత్తమ వంశజులు, నీతివంతులైనవారిని; సత్కరించి, వారితో కలసిమెలసియుండుట.

4. సమాజములో న్యాయవర్తనులైన సత్పురుషుల గుణములు గ్రహించి, ఆదేశముల ననుసరించి నడచుట.

5. పండితుడైనను, సదాచారుడైనను, శ్రీమంతుడైనను, ఇంటికి వచ్చినచో; అతనికి ఆసనము, మంచినీరు, ఇచ్చి కుశల-ప్రశ్నలచేత సత్కరించుట.

6. ఏదైన బరువుమోయువాడు (ఎత్తుకొని) మోయుటకు, అసమర్థుడైనచో; వానికి సహాయపడుట.

7. దిక్కులేనివారు, దరిద్రులు, వ్యాధిగ్రస్తులు, దీనులు మొదలగు అశక్తులకు, తన శక్తిననుసరించి, అన్నవస్త్రముల నొసంగియు, చేయగలిగినంత సేవజేయుట (సాయపడుట).

8. తలిదండ్రులు, తనకు గౌరవనీయులు మొదలగువారి ముందు వినయముతో మాట్లాడుట.

9. గ్రుడ్డివారు, కుంటివారు, చెవిటివారు, పొట్టివారు, వికృతాంగులు, నోరులేనివారు, పిచ్చివారు మొదలగువారిని- ఎప్పుడుకూడ పరిహాసము చేయకుండుట.

10. శరీరమును, ముడచికొని కూర్చొనకుండుట.

11. కండ్లు, ముక్కు, ముఖము, చేతులు, కాళ్లు మొదలగు అవయవములచేత, వికృతచేష్టలు చేయకుండుట.

12. వ్యర్థ ప్రసంగములు, అట్టహాసము- చేయకుండుట.

13. చిన్న వయస్సు పిల్లలతో- స్నేహము చేయకుండుట.

14. స్త్రీలతో, పురుషుడు వాదించకుండుట, భర్తతో; స్త్రీ వాదించకుండుట.

15. అశుభము, అసభ్యత, క్రోధపూరితము, దుఃఖదాయక మైన, మాటలు; బలుకకుండుట.

16. తల వంకరగ జేసి, కాలుపై కాలు వేసికొని, వక్షమునకు మోకాళ్లు తగులునట్లు ఆనించి, రెండుచేతులు ముడచి కొని, రెండుచేతులు కట్టివలెచాచి, కూర్చుండకుండుట.

17. శిష్టులు, పూజ్యులైనవారికి, మరచికూడ, కఠినముగ జవాబు చెప్పకుండుట.

18. భోజనసమయమందు:- చీదరించుకొనుట, అసంతోష ముగ నుండుట, చిన్నచిన్న మాటలపై క్రోధమువహించుట, ఇతరులను తిట్టుట, కండ్లెఱ్ఱజేయుట, అన్నమును పాఱవేయుట, అశుభవచనములు పలుకుట మొదలగు అమంగళప్రదములగు చేష్టలు చేయకుండుట.

19. మూర్ఖుడు, నీచుడు, దుర్మార్గుడు, దానవర్గమువాడు, తాగుబోతు, పిచ్చివాడు, లోభి, స్త్రీవశుడు, నాస్తికుడు మొదలగువారితో స్నేహము చేయకుండుట:

20. భయంకరముగ పోట్లాడుచున్న యాంబోతులను (పశువులను) చూడబోకుండుట.

21. గొలుసులు తెంచుకొని పారిపోవు గజమును; జూడబోకుండుట.

22. ఇతర కుటుంబములో, కలహించుచున్నవారితో; కల్పించుకొని మాట్లాడకుండుట.

23. పిచ్చివానివైపు ఒకే దృష్టితో చూడకుండుట.

24. వంటశాల, పండుకొనుఇల్లు, అతిథిగృహము, ధర్మశాల, పాఠశాల, దేవాలయములందు; బావి, చెఱువులలో; తులసిచెట్టు, అగ్ని, నీరు, ఉన్నచోటులందును, వస్త్రములకుకూడ; వచ్చి- పోవుదారియందు; (శ్మశానమందు) నిర్లక్ష్యముతో, మలము, మూత్రము, ఉమ్మి, విషవస్తువులు, చెత్త-చెదారము, మొదలగు మలినపదార్థములు బోయకుండుట.

25. సర్పములు, క్రూర మృగములు, పక్షులు, శస్త్రములు; వీనితో వినోదములు చేయకుండుట.

26. స్వంత లాభముకొఱకు ఇతరులపై కొండెములు చెప్పకుండుట, (గుణములను కప్పియుంచి దోషముల నారోపించకుండుట).

27. ఇతరులలోనున్న దోషములను విచారించకుండుట.

28. మూర్ఖుడు, చెడుకర్మలు చేయువాడు, ధర్మదూరుడు, కపటవృత్తిగలవాడు, భగవద్భక్తిలేనివాడు; మొదలగు దుర్మార్గులను, సత్కరించకుండుట.

29. వెండ్రుకలు, గోళ్ళు, గడ్డము- మీసములు తీయించి, ఎల్లప్పుడు స్వచ్ఛముగ, శాంతముగనుండుట.

30. శ్రీమంతుడై కూడ, (దరిద్రునివలె) మాసినవి, జీర్ణమైనవి, యగు వస్త్రములు ధరించకుండుట.

31. దేవాలయ ఆవరణలో, నదీతీరములోపల, గోవులుండు చోట, క్రిములుండుచోట, బూడిదలో, నడచుచు, నిలబడి, మల-మూత్రములు విడువకుండుట.

32. సత్పురుషుడు నిద్రించుచున్న, లేపకుండుట.

33. అంటువ్యాధిగల గ్రామములో నుండకుండుట.

34. వైద్యుడులేని యూరిలో నివసించకుండుట.

35. దురాచారములుగలవారి ప్రక్క (ఇంటిలో) నుండకుండుట.

36. గోవు, ఎద్దు, గాడిద, వీనిపై (కూర్చొనుటకు) ఎక్కకుండుట.

37. ఎంగిలి ముఖముతో తిరుగకుండుట.

38. గోళ్ళతో గడ్డిని త్రెంచకుండుట.

39. గడ్డిని నోటితో కొఱికివేయకుండుట.

40. కాలు బొటనవ్రేలిచే; భూమిని త్రవ్వకుండుట.

41. పండ్లతో, గోళ్ళు కొఱకకుండుట. (ఆడ-మగ, భేదము లేక ఏ వ్యక్తి ఇట్లు చేయునో; అట్టి వ్యక్తి సర్వనాశము నొందును.)

42. చేతితో తొడ, భుజము, మొదలగు అంగములపై కొట్టకుండుట.

43. ఆవేశముతో, అశుభ వాక్కులు బలుకకుండుట.

44. కాళ్ళు, చేతులను, మురికితో నుంచకుండుట.

45. తల్లి వెండ్రుకలకు నూనె రాచికొనుచుండుట.

46. చిటికెలు, చప్పట్లు, ఈలలు వేయకుండుట.

47. తనకున్న స్త్రీయందు; సంపదయందు; భోజనమునందును సంతృప్తికలిగియుండుట.

48. విద్యనేర్చుట, శాస్త్రములు జదువుట, దానము జే

యుట, ఈ మూడింటియందు, సంతోషించ [గర్వించ] కుండుట.

49. తన శాస్త్రాధ్యయనమునకు, నీతిమార్గమునకు, ఆటంకము గల్గించు మిత్రులు, బంధువులు లౌకిక కర్మలను త్యజించుట.

50. బుద్ధివికాసమునొందించు;నీతిశాస్త్రము,ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కళాశాస్త్రము, వైద్యశాస్త్రము, సంగీతశాస్త్రము, మొదలగు శాస్త్రములను, సమయము కల్పించుకొని, చదువుచుండుట.

51. క్రొత్త ధాన్యము, క్రొత్త వస్త్రములు, ఆభరణములు, మొదలగునవి, మంగళప్రదమైన ముహూర్తమందు ("భగవదర్పణము" జేసి) పెద్దలయనుమతితో నుపయోగించుట

52. వేద, శాస్త్ర పారంగతుని, సదాచారుడైన గృహస్థుని, అన్ని వేళల సత్కరించుట.

53 తాను, కూడబెట్టినధనమును, యథాశక్తి, సమయానుకూలముగ, భగవత్కార్యములు, పరోపకారములందు, వినియోగించుట.

54. ఉదయించునప్పుడు, అస్తమించునపుడు, గ్రహణకాలమందు, మధ్యాహ్నకాలమందు, అద్దముయందు, నీటియందును, సూర్యుని (ప్రతిబింబమును) జూడకుండుట.

55. ఇంద్ర ధనుస్సును ఇతరులకు జూపకుండుట.

56. గోవత్సము (లేగ) ను, కట్టివేసిన త్రాటి ( తనుగు ) పైనుండి దాటకుండుట.

57. నీరు, నూనె, బురదలో, తననీడను జూడకుండుట. [ శాంతివిధానమందు మాత్రము నూనెలో జూచుట యుక్తము. ]

58. తనకు ఎదురైె [వచ్చి]న, బ్రాహ్మణులను, గోవు, పాలు-పెరుగు, అశ్వత్థ వృక్షము, వటవృక్షము, బిల్వవృక్షము, తులసి వృక్షము మొదలగువానిని సన్మానించి, ముందుకుబోవుట.

59. అగ్నిని ఎట్టిసమయమందైనను, నోటితో నూదకుండుట.

60. అగ్ని, అద్దము, పుస్తకము, భోజనము, మంచము, రాగి-ఇత్తడి పాత్రలు, మొదలగువానిని తన్నుటగాని, దాటిపోవుటగాని చేయకుండుట.

61. నీరు త్రాగుచున్నట్టి, మేత మేయుచున్నట్టి (గోవులు) పశువులను కొట్టకుండుట.

62. దోసిలితో నీరు త్రాగకుండుట.

63. బంగారము, వెండి మరియు రాగితో చేసిన వస్తువులను కాలితో తన్నకుండుట.

64. ఉదయకాలమందు ఎండలో కూర్చొనకుండుట.

65. శవదహనమందు వచ్చు పొగను, దేహముపై బాఱనీయకుండుట.

66. ఇతరులు ధరించి తీసిన "పుష్పములను" ధరించకుండుట.

67. తాను మెడలో ధరించిన పూలమాల, జందెము, మంగళసూత్రము మొదలగునవి త్రెంచకుండుట.

68. ఎపుడుకూడ జూదమునాడకుండుట.

69. వర్ష కాలమందు నడచుచు పరుగెత్తకుండుట.

70. పాదరక్షలు చేతబట్టుకొని నడవకుండుట.

71. ముఖ్యమైన ద్వారము [త్రోవ] గాక, సందుగొందుల నుండి, గ్రామము— లేక; ఇంటిలో, ప్రవేశింపకుండుట.

72. ప్రవహించుచున్న నదిని [ఈదుచు] దాటుటకు ప్రయత్నించకుండుట.

73. రెండుచేతులతో తల పట్టుకొనకుండుట.

74. సద్బ్రాహ్మణుని, క్షత్రియుని, సర్పమును అవమానించకుండుట [నొప్పించి విడువకుండుట].

75. బావి— లేక— చెరువు గట్టుపైన నిద్రించకుండుట, బావి పై నుండి [తొంగిచూడకుండుట] దాటిపోకుండుట.

76. గ్రుడ్డివారు, కుంటివారు, మూగవారు, పిచ్చివారు, వికృతరూపము గలవారు, మరియు బ్రాహ్మణులు, రాజులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, పశువులు, మొదలగువారికి దారియిచ్చి, తాను ప్రక్కగాపోవుట.

77. వాసనలేనివి, విపరీతముగ పరిమళముగలవి, రక్తవర్ణము గలవి యగు పుష్పములను ధరించకుండుట.

78. కాంతివిహీనమైన, లేక— పగిలిన, అద్దములో ముఖమును జూచుకొనకుండుట.

79. స్నానము చేయునపుడు, వస్త్రమును ధరించునపుడు, కాటుక బెట్టుకొనునపుడు, (నగలు) అలంకరించుకొనునపుడు, భోజనము చేయునపుడు, నిద్రించునపుడు, వినోదించునపుడు, ఇల్లాలును—లేక—పరస్త్రీని చూడకుండుట.

80. చేతితో మంటిపెల్లను ఎగురవేయుట— లేక— నలిపివేయకుండుట.

81. అగ్నికి కాళ్లుజూపుచు కూర్చొనకుండుట.

82. ఇతరులు ఉపయోగించుచున్న వస్త్రములు, పాదరక్షలు, మాలలు, జందెములు, ఆభరణములు ధరించకుండుట.

83. పర్వతములందు విశ్రమించకుండుట; నిద్రించకుండుట.

84. నాట్యములు (సినిమాలు) చూచుట, పాటలు వినుట యందెక్కువ ఆసక్తిలేకుండుట.

85. అన్ని వేళలందు నందరితో కఠినోక్తులు బలుకకుండుట.

86. ఏకాంతముగ పరస్త్రీలతో, మాట్లాడకుండుట.

87. స్త్రీలను నిర్లక్ష్యముతో నవమానించకుండుట.

88. చిన్నపిల్లల తలపై గట్టిగా (మరచికూడ) కొట్టకుండుట.

89. దేవతలు, గురువులు, బ్రాహ్మణులు, ధర్మశాస్త్రములు, భగవద్భక్తులు మొదలగువారిని; విమర్శింపకుండుట; నిందించకుండుట.

90. ఇతరుల సంపదలనుజూచి "అసూయ" జెందకుండుట.

91. ధర్మశాస్త్రములు, తీర్థస్థలముల మహిమను స్వచ్ఛముగ వర్ణించి చెప్పుట.

92. తనకు కలిగిన అవమానమును, వైరమును, దుఃఖమును మరచిపోవుట.

93. అన్నివేళలయందును సత్యమైన, ప్రియమైన మాటలు బలుకుచుండుట.

94. ఏకవస్త్రముతో - లేక, నగ్నముగా స్నానము జేయకుండుట.

95. సూర్యుని, చంద్రుని, అగ్నిని, బ్రాహ్మణుని, గోవును

జూచుచు మలముగాని, మూత్రముగాని విడువకుండుట. (ఇట్లు చేయుటవల్ల; విజ్ఞానము, బుద్ధికుశలత నశించును).

96. సంధ్యాకాలమందు, భోజనముగాని. నిద్రించుటగాని, స్త్రీగమనముగాని- చేయకుండుట.

97. రాత్రులందు వృక్షములక్రింద నుండకుండుట; నిద్రించకుండుట.

98. మంచములో, చేతిలో భోజనపాత్రనుబెట్టిభుజించకుండుట

99. ఇటు-నటు తిరుగుచు భుజింపకుండుట.

100. నగ్నముగనుండి నిద్రించకుండుట.

101. చపలత్వముతో, పురుషుడు స్త్రీవేషము-లేక; స్త్రీ-పురుష వేషము (నిర్బంధపరిస్థితులయందుతప్ప) ధరింపకుండుట.

102. మనస్సునందు, కపటము, ఇతరులకు, ద్రోహముచేయు బుద్ధిలేకుండుట.

103. జలమునందు, ఇంటిలోనిటు-నటును ఉమ్మినేయకుండుట.

104. సత్యము, ధర్మము, సదాచారము, నీనిలో లోపము గాకుండ నడచుటకు ప్రయత్నించుట

105. అధికారము, అవకాశముననుసరించి, ప్రతిదినము భగవంతుని; యారాధన, నివేదన, నామస్మరణాదులచే సేవించుట.

మొదలగునవి యన్నియు మనకు ఆచరణ యోగ్యములుగా జెప్పబడినవి. మరియు:-

శ్లో|| వయసః కర్మణోర్థస్య శ్రుతస్యాభి జనస్యచ,
వేషవాగ్బుత్తి సారూప్యమాచరన్ విచరేదిహ ||
(మనుస్మృతి- 4-18)

—మానవుడు; తన జాతి, వయస్సు, సంపద, అధికారము, వేషము ననుసరించి మాటదప్పనివాడై, జీవితానుకూలముగ, (శాస్త్రవిహితముగ) ప్రపంచమునందు నడచుకొనవలెను.

అని యుండుటచేతను, పైన వివరించిన "సాధారణ ధర్మలను" పాటించుచు ప్రవర్తించవలెను. ఇందులో కొన్ని యలవాట్లు చిన్నతనమునుండియే, మన తలిదండ్రులు, పెద్దలు, (తాము ఆచరించుచు) మనకు బోధించినట్టివే... ఐనను నేటి సమాజములో, నిట్టి "సామాన్య ధర్మలు" కూడ లోపించి, నైతికబలము క్షీణించుచున్నది. మానసిక ప్రవృత్తులు సంకుచితములై పోవుచున్నవి కావున ఇప్పటికైనను మనమెట్టిదశ లోనున్నామో? తిరిగి చూచుకొని, మన పెద్దలు, సత్పురుషులు నడచినట్లు, చెప్పినట్లు ధర్మవిహితమైన, మార్గమున నడచుకొనవలయును. పవిత్రమైన యాచరణగలవారమై "మనుష్యులమని" హృదయపూర్వకముగ జెప్పుకొనుటకు, తగిన యర్హతను సంపాదించవలెను.

అందుకు దైవీగుణములతో పాటు, నీతికి పునాదులైనట్టి "సామాన్య ధర్మలను" గూడ ఆచరించుటకు (అలవఱచుకొనుటకు) ప్రయత్నింతము. అందువల్ల మనము జీవితములో, శాంతి, సుఖము, యశస్సులను, బొందుటయేగాక; ముఖ్యముగ సాత్వికులమై, పవిత్రులమై, భగవత్కృపకుకూడ పాత్రుల మగుదుము. భవబంధములనుండి "విముక్తులము" గుదుము.

—॥ సర్వం శ్రీమన్నారాయణార్పణమస్తు ॥—

(75 నయాపైసల పోస్టుబిళ్లలు పంపినచో, ఒక ప్రతి బుక్ పోస్టు ద్వారా పంపబడును. ఎక్కువ ప్రతులకు వి. పి. చార్జీలు ప్రత్యేకము).

ప్రతులకు:-

కలవకుంట పురుషోత్తమాచార్యులుగారు

రామానుజ ఆయుర్వేద నిలయము,

పోస్టు: పూడూరు (వయా: కొత్తపల్లి) కరీంనగరము జిల్లా.